ISSUED ON: 7-6-58

Vol. XIII
No. 1




13th March, 1958
( Thursday )

# ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

# OFFICIAL REPORT

## Part II — Proceedings other than Questions and Answers



CONTENTS



NOTE :— * At the commencement of the speech denotes confirmation from the members not received in time.

PRINTED BY SHIVAJI PRESS, SECUNDERABAD,
FOR THE DIRECTOR, GOVT. PRINTING PRESS, HYDERABAD-A.P.

ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES

[ Part II Proceedings other than Questions and Answers ]

**OFFICIAL REPORT**

42nd Day of the Sixth Session of
the Andhra Pradesh Legislative Assembly

**ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY DEBATES**

*Thursday, the 13th March 1958.*

The House met at Half Past Eight of the Clock

*[ Mr. Speaker in the Chair ]*

## QUESTIONS AND ANSWERS

(See Part I)

## CALLING ATTENTION TO MATTERS OF URGENT PUBLIC IMPORTANCE : POLICE FIRING ON LAMBADIS OF GOPANNAPETA

శ్రీ ఎ. శ్రీరామమూర్తి (విజయనగరం) - అధ్యక్షా ! మహబూబ్‌నగర్ జిల్లా గోపన్నపేటలో లంబాడీలపైన Police firing జరిగింది దీనివల్ల సుమారు 12 మందికి తీవ్రమైన గాయాలు తగిలాయి. అసలు Jurisdiction లేని Police S I. చేసిన ఈ కాల్పులు ఆ ప్రాంతంలోనే కాకుండా, నాగరికులు ఉన్న ప్రతి ప్రాంతం లోను తీవ్ర అసంతృప్తిని కలుగచేస్తున్నాయి. దీనికి కారణ మేమిటి? ఎక్కడో దొంగతనం జరిగితే దొంగను పట్టుకోవడానికి ప్రయత్నం చేస్తున్నారు. వెనుకబడిన వర్గాలకు చెందిన పేదవారిపైన ఈ రకమైన దొంగతనం ఆపాదించడము తరతరాలనుంచి వస్తున్న పాత రాచరికానికి సంబంధించిన మనస్తత్వానిది Rude Investigation method. లంబాడీలలో దొంగ వున్నాడేమోనని Investigation కు వెళ్ళారు వెళ్ళి వెంటనే కాల్పులు జరిపారు. మనకు స్వాతంత్ర్యము వచ్చిన తరువాత ప్రజల ప్రాణాలకు విలువ లేకుండా పోయింది. కాల్పులు జరిగినచోట తక్షణమే enquiry చేయించాలి తరువాత దానిని శాసన సభ ముందుకుండా ప్రవేశపెట్టాలని కోరుతున్నాను.

మిస్టర్ స్పీకర్:—ఏమి జరిగిందని అడగండి, lecture అక్కరలేదు.

[ 13th March 1958

## BUDGET — DEMANDS FOR GRANTS

*Demand No. XXVII* — WELFARE OF SCHEDULED ~~TRIBES~~, CASTES, ETC. — Rs. 2,39,16,100.

*THE MINISTER FOR SOCIAL WELFARE AND INDUSTRIES (SRI D. SANJIVAYYA)* : Sir, On the recommendation of the Governor, I beg to move :

> "That the Government be granted a sum not exceeding Rs. 2,39,16,100 under Demand No. XXVII—Welfare of Scheduled Tribes, Castes, etc.".

*MR. SPEAKER* : Motion moved.

శ్రీ డి. సంజీవయ్య:- అధ్యక్షా ! ఈ [illegible] పద్దును ప్రతిపాదిస్తూ కొన్ని విషయాలు చెప్పదలచుకున్నాను. ఈ పద్దు క్రింద [illegible] హరిజనుల, గిరిజనుల, విముక్త [illegible] [illegible] ఖర్చు కాబడుతుంది.

విద్యా విషయకంగా, వెనుకబడినవారిని విద్యావంతులుగా [illegible], వారు, విజ్ఞానాన్ని సంపాదించుకొని, ఆలోచనా [illegible] వారి స్థితిని వారే బాగుపరచుకొనే అవకాశాలను [illegible] ప్రభుత్వ [illegible] శ్యము. అందుకనే వారి విద్యకొరకు హెచ్చుగా ఖర్చుచేస్తున్నాము. వాళ్ళు పాఠశాలల్లో, లేక కళాశాలల్లో చదువుతున్న సందర్భంలో [illegible] వలసిన అవసరంలేదు. వారికి విద్యార్థి [illegible] [illegible] కాకుండ, కొంతమంది నిరుపేదలైనవారు, పట్టణాలకు వెళ్ళి విద్యను [illegible] దలచుకుంటే, వారు, అక్కడ ఉండడాని, [illegible] విద్యార్థి వసతి గృహాలు ఏర్పాటుచెయ్యబడ్డాయి. ఆంధ్ర ప్రాంతంలో [illegible] గృహాలు [illegible] 100 ఉన్నాయి. ఆంధ్రప్రదేశ్ ఏర్పడక పూర్వం తెలంగాణాలో [illegible] మాత్రమే ఉన్నాయి. ఇప్పుడు అవి 50 వరకు పెరిగాయి. [illegible], గత సంవత్సరం తెలంగాణా ప్రాంతంలో 26 కొత్త Hostels ఏర్పాటుచెయ్యబడ్డాయి. [illegible] మంది పెద్దలను, శాసనసభ్యులను, సంఘసేవాపరాయణులను కలుసుకొని, ఈ ప్రాంతంలో Hostels చాలా తక్కువగా ఉన్నాయి కాబట్టి ఎక్కడ [illegible] అక్కడ ఈ Hostels ను ఏర్పాటుచెయ్యవలసిందని ప్రార్థించాను. దానికి ప్రభుత్వము తగిన ధన సహాయము చేస్తుందని [illegible] మనవిచేశాను. ఆ ప్రకారంగా చాలామంది పెద్దలు అక్కడక్కడ hostels ఏర్పాటుచేశారు. ముఖ్యంగా ఆడపిల్లలకొరకు ఇక్కడ hostels లేవు. ఒకసారి వరంగల్‌కు [illegible] ఈ విషయాన్ని గురించి, కనకరత్నమ్మగారితో ఆలోచించడం తటస్థించింది. వారు వెంటనే

అక్కడ ఒక girls' hostel ను ఏర్పాటుచేశారు. ఇంకా అటువంటి hostels ను ఏర్పాటుచేయడానికి లక్ష్మీకాంతమ్మగారు, తదితర శాసనసభ్యురాండ్రు ప్రయత్నం చేస్తారని తలుస్తున్నాను.

సాధారణంగా, హరిజనులు పెద్ద చదువులు చదివి, పెద్ద ఉద్యోగాలు సంపాదించుకున్న తరువాత, సరియైన విద్యగాని హరిజన బాలికలను పెళ్ళిచేసుకొనక, సవర్ణ స్త్రీలతోగాని, ఇతర జాతులతోగాని వివాహం చేసుకోవడం జరుగుతున్నది. అందువల్ల హరిజన బాలికలు బాగా చదువులు చదివినట్లయితే, వారుకూడ విజ్ఞానవంతులైన వారితో వివాహాలు చేసుకుంటే, మెచ్చు హరిజన కుటుంబాలు బాగుపడుతాయి. కాబట్టి అటువంటి ప్రయత్నం చెయ్యాలని కోరుతున్నాను. అయితే, ఈ hostels గురించి కొన్ని విమర్శలు చెలరేగుతున్నాయి. ప్రభుత్వం చేతులలో సరిగా hostels ఉండటంలేదనీ, ఇవన్నీ ప్రభుత్వం చూడవలసి ఉంటుంది అని కొంతమంది అంటున్నారు. దీని విషయంలో Planning Commission వారు, కేంద్ర ప్రభుత్వంవారు చెప్పే ప్రధాన సూత్రం ఏమంటే, ప్రభుత్వం నిర్వహించవలసిన ప్రణాళికలలో సిద్ధాంతాలను అనుసరించి, ఇటువంటి, చిన్న చిన్న సంస్థలను నడిపే బాధ్యత, కొన్ని ఇతర సంస్థలకో, లేక కొంతమంది వ్యక్తులకో, అప్పచెప్పాలని, ఆ బాధ్యతలు ప్రభుత్వం వహించకూడదని వారు అంటున్నారు. అందువల్ల సాధ్యమైనంతవరకు, వీటిని, ఏ హరిజన సేవా సంఘానికో, ఏ హరిజనోద్ధరణ సంఘానికో, విద్యార్థి సంఘానికో, లేక సాంఘిక సేవా సమాజానికో అప్పచెప్పాలి. లేక దీనికోసం ఏ వ్యక్తులైనా శ్రద్ధవహించి నడపడానికి, ఉద్యుక్తులుగా ఉన్నట్లయితే, ఆ వ్యక్తులకే అప్పగించడం మంచిదని అభిప్రాయపడుతున్నాను. ఈ రోజుల్లో నడపబడినప్పుడు ఒక్కొక్క విద్యార్థికి నెలకు 15 రూపాయలు ఇస్తున్నాము. దీనిని ప్రభుత్వమే నడిపించవలసివచ్చినప్పుడు ప్రతి విద్యార్థి మీద [illegible]/-, [illegible]/- రూపాయలవరకు ఖర్చు అవుతుంది. ప్రభుత్వం నడిపినందువల్ల విశేషంగా లాభం ఉండదు. కొన్నిచోట్ల కొంతమంది ఈ hostels ను సరిగా నడపడంలేదు. ఒక రిద్దరు అలాగ చేస్తున్నందువల్ల, అందరూ ఆ విధంగానే చేస్తున్నారని అనుకోవడం భావ్యం కాదు.

నెల్లూరులో ఒక హరిజన హాస్టల్ ఉన్నది. అందులో 575 మంది పిల్లలు చదువుకుంటున్నారు. దానిని పట్టాభి రామారెడ్డిగారు నడిపిస్తూ ఉన్నారు. దానికి ప్రభుత్వం ఇచ్చే డబ్బే కాకుండా, వారు స్వంతంగా ఎంతో ఖర్చుపెట్టి చక్కగా ఆ పిల్లలను పోషిస్తున్నారు. అంతేకాకుండ, విద్యార్థి చదువు పూర్తి అయిన తరువాత ఉద్యోగము దొరకకపోతే, అతను ఎక్కడా ఉండడానికి వీలులేనప్పుడు అతనిని hostel లోనే ఉంచుకొని, భోజన వసతులు కల్పించి, ఉద్యోగం సంపాదించే విషయంలో అతనికి అన్నివిధాలా సహాయపడి, ఆ సందర్భంగా ఏ వైద్యాధి

13th March 1958]

అనుకున్నప్పుడు, ఆంధ్రలోవలె ఇక్కడకూడ 15/- రూ. చొప్పున ఎందుకు ఇవ్వడం లేదో, Director గారితో మాట్లాడుతానని చెప్పాను. కాని విచారిస్తే తెలిసిన విషయం ఏమంటే, Boarders నుంచి Hostel Managers కొంత డబ్బు వసూలు చేస్తున్నారు కాబట్టి, Social Welfare Department వారు ఏ విధమైనటువంటి సహాయము చెయ్యడానికి వీలుపడదని తెలిసింది.

కాబట్టి వారికి నేను మనవిచేసేది ఏమంటే, paying capacity ఉన్న boarders దగ్గరనుంచి డబ్బు తీసుకోవచ్చు. కాని, ఎవరైతే చాల బీదవారుగా ఉన్నారో, అట్టివారిని ఉచితంగా చేర్చుకోండి; వాళ్ళకు సౌకర్యములు కల్పించండి; అటువంటివాళ్ళు ఎంతమంది ఉన్నారో, ఒక List వ్రాసి ఇస్తే వారికి 15/- రూ. చొప్పున grant ఇస్తామని మనవిచేస్తున్నాను. దీన్నిబట్టి ప్రభుత్వం ఇచ్చే ధన సహాయం వారు పొందుతారని ఆశిస్తున్నాను.

ఇక స్కాలర్‌షిప్పుల సంగతి. హరిజనుల పిల్లలకు సంబంధించినంత వరకు మెట్రిక్యులేషను వరకు రాష్ట్రప్రభుత్వమే వారికి స్కాలర్‌షిప్పుల నిస్తున్నది. మెట్రిక్యులేషను తరువాత ఇంటర్మీడియట్ గాని, ప్రీయూనివర్సిటీ గాని, బి.ఏ. గాని, మెడిసిన్, ఇంజనీరింగ్ వంటి వృత్తికళాశాలలకు గాని భారత ప్రభుత్వం వారే స్కాలర్‌షిప్పులు యిస్తున్నారు. అది చాలా సవ్యంగా జరుగుతున్నది. హరిజనుల పిల్లలకు సంబంధించినంత వరకు ఎవరికి స్కాలర్‌షిప్పు రాలేదని చెప్ప డానికి అవకాశంలేదు. అందరికి స్కాలర్‌షిప్పులు వచ్చివుంటాయి. ఎవరికైనా రాకుంటున్నంటే, వారు సకాలంలో దరఖాస్తు పంపకుండడం వల్లనో, వయస్సు పరిమితి ఎక్కువగా వుండడం చేతనో, ఏదో లోపమువలన రాకపోయి వుండ వచ్చును గాని సకాలంలో అర్జీపెట్టుకొని, అన్ని షరతులకు కట్టుబడివుంటే తప్పకుండా ప్రతి హరిజన విద్యార్థికి స్కాలర్‌షిప్పు వస్తుంది. వెనుకబడిన జాతుల విద్యార్థులకు మాత్రం కొంచెం యిబ్బందిగా వుంది. కేంద్రప్రభుత్వం విశేషంగా డబ్బు ఇవ్వడం లేదు. Merit వుండి 60%, 70% మార్కులు వచ్చినవారి కిస్తున్నారు. రాష్ట్రప్రభు త్వం దగ్గరకూడా పిల్లలందరికీ స్కాలర్‌షిప్పు యివ్వడానికి తగినంత డబ్బులేదు, 57–58 సంవత్సరం సంగతి చెబుతున్నాను. దాదాపు 12 లక్షల రూపాయలైతే యిప్పుడు pending లో వున్న వెనుకబడినజాతుల దరఖాస్తుదారు లందరికీ స్కాలర్‌షిప్పు యివ్వడానికి అవకాశం వుంటుంది. కాని మన బడ్జెటులో సుమారు 3,75,000 రూపాయలు వుంది, కేంద్రప్రభుత్వం వారు 1,25,000 రూపాయ లిచ్చినారు. 5 లక్షల కంటె హెచ్చుగా డబ్బులేదు. అందరికీ యివ్వడాని కిది చాలదు. అందుచేత merit ప్రకారం యివ్వనిర్ణయించినాము. 60% మార్కులు వచ్చిన వారికి ముందు యిచ్చి, తరువాత 59% మార్కులు వచ్చిన వారికివ్వడం, ఆప్రకారంగా merit ను బట్టి ఇస్తూ వచ్చినాము, కొంతకాలంపోయిన తరువాత

సంబంధించినంతవరకు అది చాలా సౌలభ్యముగా వున్నది. మహబూబ్‌నగర్ జిల్లా నుంచి, మిగతా జిల్లాలనుంచి ఇండ్ల స్థలాలకు సంబంధించిన కాగితాలు రావడం తటస్థించింది. 150 రూపాయలతో 5 ఎకరాలు తీసుకోవడం ఒక 50, 60 కుటుంబాలకు ఇండ్ల స్థలాలు కల్పించడం జరుగుతోంది. ఇంత చౌకగా పొలం లభించితే చాలా త్వరగా యీ సమస్య పరిష్కరించవచ్చును. కాని పశ్చిమ - గోదావరి జిల్లాలో, పూళ్ళ, కైకరము - ఆ రెండింటిలో ఏదో ఒక ఊరిలో అయిదు ఎకరాలో, ఆరెకరాలో హరిజనుల యిండ్ల స్థలాలకోసం తీసుకున్నాము. దానికోసం దాదాపు 43 వేల రూపాయలో, 45 వేల రూపాయలో ఒక ఊరిలోనే ఖర్చయినది. అటువంటి చాలా ఖరీదైన పొలమును ఇండ్ల స్థలాలకోసం తీసుకోవలసివస్తే యీ సమస్య గురుతరమై, దీనిని పరిష్కరించలేమేమో అనే సంశయముగూడా వుంది. పోయినతూరి చెప్పిన ఇంకొక సలహానే మరొకసారి జ్ఞాపకం చేస్తే బాగుంటుందని చెబుతున్నాను. మహాత్మా గాంధిగారి శిష్యులైన వినోబాభావే గారు దేశమంతా పర్యటనచేస్తూ భూదానయజ్ఞం మొదలుపెట్టినారు. భూదానం చేయాలని పెద్దలందరూకూడా చెబుతున్నారు. భూదానంచేస్తున్నప్పుడు గ్రామానికి ప్రక్కగా వుండే స్థలంలో ఒక ఎకరంగానీ, 10 సెంట్లుగాని, 10 సెంటులుగాని నలుగురో అయిదుగురో హరిజనులు ఇండ్లు వేసుకోడానికి అనువుగా వుండే స్థలాలను భూదానంగా యిస్తే అది మహోత్కృష్టమైన దానమని భావిస్తున్నాను. ఆ విధముగా పెద్దలు చేయాలని అర్థిస్తున్నాను. పశ్చిమ గోదావరిజిల్లాలో ఒకసారి నేను వెళ్ళినప్పుడు చాలమంది కాంగ్రెసు పెద్దలను, మిత్రులను, శాసనసభ్యులను ఒక ఊరిలో నేను ఇదేవిధముగా చెప్పితే అప్పటికప్పుడు కొంతమంది పెద్దలు వచ్చి కొన్ని స్థలాలు యివ్వడం తటస్థించింది. ఆ విధముగా శాసనసభ్యులుగాని, సంఘసేవాపరాయణులుగాని వారి వారి ప్రాంతాలలో, తాలూకాలలో, జిల్లాలలో యిట్టి ప్రయత్నం చేస్తే కొంతవరకు దీనిని పరిష్కరించడానికి అవకాశం వుంటుందనుకుంటాను. తరువాత సమస్య ఇండ్లు కట్టుకోవడం. ఇండ్ల స్థలాలు యిస్తున్నాముగాని ఇచ్చిన స్థలాలలో వారు ఇండ్లు కట్టుకునే స్థితిలో చాలమంది లేరు. అందువల్ల వారికి ఇండ్లు కట్టే ప్రయత్నం జరుగుతున్నది. కేంద్రప్రభుత్వం వారుకూడా కొంత ధన సహాయం చేస్తున్నారు. అయితే రాష్ట్ర ప్రభుత్వం తల పెట్టిన కార్యక్రమంగాని, కేంద్ర ప్రభుత్వం ఇచ్చిన ధనంవల్ల జరిగే నిర్మాణం గాని, యివన్నీ చేస్తే తాలూకాకు రెండు మూడు గ్రామాలకు అట్టి సహాయము చేయగలుగుతాము.

మిగతా గ్రామాల సంగతి మిత్రులైన, అటవీశాఖామాత్యులైన శ్రీ తిమ్మారెడ్డిగారితో మాట్లాడినాను. Forests దగ్గరగా వుండు ప్రదేశములలో వున్న వీరలకు కలప ఉచితముగానో, nominal charges కో ఇచ్చుటకు ప్రయత్నము చేస్తు

న్నానని అన్నారు. ఈ విధముగా వారు చాల గ్రామాలకు సహాయముచేశారు. ఇటువంటి సహాయము బీదలకు చేసిన, వారు ముందుకు రావడానికి అవకాశ ముంటుంది. తాగే నీట విషయములో కొన్ని గ్రామాలలో అందరికి కలిపి ఒక ఖావి మాత్రమే వుంటుంది. ఆఖావివద్దను హరిజనులు వెళ్లి ఖావిగట్టున కూర్చొన వలసివుంటుంది. సవర్ణహిందువులు లోపలికివెళ్లి నీరుతెచ్చి పోయవలయును. ఇది అంతా వారి దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి వుంటుంది. హరిజనులకు ప్రత్యేక బావులు త్రవ్వించాలని అనుకొంటున్నాము. కొన్నిచోట్ల త్రివ్వించడము కూడా జరిగింది. కేంద్రప్రభుత్వమువారు కూడా ఈవిషయములో కొంత ధనము సహాయము చేశారు. ఆ కార్యక్రమములవల్ల కూడా చాలచోట్ల బావులు త్రవ్విస్తున్నాము. వీరికి Carpentry, Dress Making, Mat Making మొదలైన వృత్తి విద్యలను నేర్పించడానికి ప్రభుత్వము ఆలోచిస్తున్నది.

ఈ విషయము గురించి కేంద్ర ప్రభుత్వమువారు కొన్ని పథకాలను వేసి పంపించారు. కొంతమంది చదువుకొన్నపిల్లలకు ఉద్యోగాలు దొరుకుట కష్టముగా వుంది. S. S. L. C. ప్యాసు అయిన వారికి stenography నేర్పించడానికి Schemes వేస్తున్నాము. ఆకార్యక్రమముకూడా జరుగుతూవుంది. దీనివల్ల చాల మంది లాభపడుతున్నారు. ఇక గిరిజనులను గురించి చెప్పవలసివుంది: కొండలలో నివసించుచూ గ్రామాలు ఎరుగనివారు, నాగరిక ప్రాంతాలను చూడనివారు, కొన్నిచోట్ల గుడ్డలుకూడ కట్టుకొనుట ఎరుగనివారు వున్నారు. వారిని ఆ అనాగరిక పరిస్థితులనుంచి తొలగించి, వారిస్థితిని బాగుచేసి, వారికి విద్య నేర్పించే ఏర్పాట్లు చేస్తున్నాము. వారి ఆరోగ్యమును, ఆర్థిక పరిస్థితిని బాగుచేయవలసి వుంది. ఉమ్మడి మద్రాసు రాష్ట్రములో మలయప్పన్ ఆధ్వర్యాన ఒక కమిటీని ఏర్పాటు చేయడము జరిగింది. విద్య, ఆరోగ్యశాఖలకు సంబంధించిన ఆఫీసర్లు శ్రీకాకుళం, విశాఖపట్టణము, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలు పర్యటించిన తరువాత ఒక సమగ్రమైన రిపోర్టును సమర్పించారు. ఆ నివేదికననుసరించి ద్వితీయ ప్రణాళిక కాలములో గిరిజనులకు కావలసిన అభివృద్ధి కార్యక్రమాలను రూపొందించినారు. వారి ఆర్థికపరిస్థితి బాగుపడాలంటే వారు పండించే పంటకు, అడవులలో సేకరించే వస్తువులకు సరియైన ధర లభించేటట్లు చేయాలి. ఉదాహరణకు వడ్డాది, మాడుగులవద్ద పిప్పళ్లు వస్తాయి. అక్కడివారు ఎంతో శ్రమపడి దాదాపు 6 మాసాలు 7 మాసాలు కృషిచేసి, మంచి ఎరువులువేసి పండించడము జరుగుతుంది. వాటిని Market కు తీసుకొని వస్తారు. మార్కెటులో మణుగు 10 రూ॥ లకో, 15 రూ॥ లకో కొంటారు. బొంబాయినుంచి సేట్సు అక్కడకు కాపురము వచ్చివుంటారు. వాటిలో మంచి quality కి మణుగు 1500 రూ॥లు కూడా వస్తుంది. వైద్యానికి సంబంధించిన ఈ పిప్పళ్ల వ్యాపారమే

రమారమి 50 లక్షల రూపాయిల వరకు వుంటుంది. రు. 45 లక్షల వరకూ అక్కడ ఉండే ఏజెంట్లు అనుభవిస్తున్నారు. మిగిలిన 5 లక్షల రూపాయిలైనా గిరిజనులకు చెందదు. అక్కడ ఇంకా అల్లం, ఉల్లిపాయలు పండిస్తారు. కమలాపండ్లు, అడ్డాకులు అక్కడినుంచి తీసుకొనివచ్చి అమ్ముతారు. వీటి నన్నిటిని దృష్టిలో పెట్టుకొని ఒక Co-operative Finance Corporation ను ఏర్పాటు చేశాము. దానికి ఒక Deputy Collector ను General Manager గా వేశాము.

ఈ కార్యక్రమమును యితర జిల్లాలకు విస్తరింప చేయాలని మా ఉద్దేశ్యము. శ్రీకాకుళము, విశాఖపట్టణం జిల్లాలలో ఈ కార్యక్రమము అమలు జరుగుతున్నది. శ్రీకాకుళం, విశాఖపట్టణములలో వుండే యితర ప్రాంతాలకు విస్తరింపచేస్తూ, తూర్పు గోదావరి, పశ్చిమ గోదావరి జిల్లాలకు కూడ వర్తింప చేయాలని, తదుపరి తెలంగాణా ప్రాంతములోని ఏజన్సీ ప్రాంతపు గిరిజనులకు వర్తింప చేయాలని అనుకొంటున్నాము. అందుచే Collector హోదాలోవున్న ఒక I. A. S. Officer ను General Manager గా నియమించాము. ఈ Scheme ను తయారు చేసిన తరువాత కార్పొరేషన్ ఏర్పాటు చేయాలన్నపుడు అతనినే Special Officer గా చేయడము, ఆయన Scheme ను వ్రాసి, యిచ్చిన తరువాత దానిని ప్రారంభించడము జరిగింది. అనుభవజ్ఞులైన, ఆ కొండజాతులతో సంబంధము కలిగి, వారి మనస్తత్వాలు బాగా అర్థము చేసుకొన్న Officer ను వేస్తే బాగుంటుందనే ఉద్దేశ్యముతో ఒక నెల క్రితము ఒక ఉద్యోగిని నియమించాము. కార్యక్రమము బాగా జరుగుతున్నది. వారు పండించే పంటలకు, forests నుంచి పోగుచేసి తెచ్చు వస్తువులకు సరియైన ధరలు అందచేసి వారికి కావలసిన ఎండు చేపలు, కిరసనాయిలు, ఉప్పు మొదలైన వారి దైనందిన జీవితానికి కావలసిన వస్తువులను సరఫరా చేయాలని ప్రయత్నిస్తున్నాము. Plains నుంచి షాహుకార్లు వచ్చి 2, 3 నెలలకు ముందుగానే వారికి 4 రూపాయలో, లేక 5 రూపాయలో ఇచ్చి పంటవచ్చిన తరువాత చాల చవుకగా ఆ సరుకును తీసుకొని వెళ్లడము జరుగుతున్నది. Plains వారినుంచి ఈ గిరిజనులను రక్షించడానికి, ఇదే మార్గమని ఆశించాము. గిరిజనులు నివశించే ప్రాంతాలలో రోడ్లుకావాలి. వీరి ఆర్థికపరిస్థితిని బాగుపరచడానికి శ్రీ సుందరయ్యగారు డబ్బు అంతా రోడ్లమీదనే ఖర్చు అయిందా అన్నారు. రోడ్లమీద వెళ్లి హరిజనులను exploit చేస్తారు అన్నారు. అందరు exploit చేస్తారా ? రోడ్లు వేస్తే కార్పొరేషన్ అధికారులు అక్కడకు వెళ్లి వారికి నచ్చచెప్పే అవకాశముంటుంది.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : ఇంత డబ్బు రోడ్లమీద ఖర్చు పెట్టుట ఎందుకు?

శ్రీ డి. సంజీవయ్య : వారు ఆ ప్రాంతాన్ని చూడలేదని తెలుస్తున్నది భద్రాచలం కొండలు ప్రాంతములో రోడ్లు వేయకపోతే ప్రయోజనముండదు.

13th March, 1958]

శ్రీ ఆర్. నారాయణరెడ్డి : నేను భద్రాచలం కొండలు చూశాను.

శ్రీ వి. సూర్యయ్య (గుడివాడ-రిజర్వుడు) : రోడ్లు వెయ్యవద్దని లేదు. ఆ రోడ్లు వేసే డబ్బును గిరిజనుల సంక్షేమాన్నికోరి ఖర్చుపెట్టిన బాగుంటుంది. Central Government ఏర్పాటు చేసిన డబ్బు రోడ్లమీద ఖర్చుపెట్టక general ఖర్చు లోంచి రోడ్లకు ఖర్చుపెట్టమని మనవి చేస్తున్నాను.

శ్రీ డి. సంజీవయ్య : రోడ్లకు కేటాయించిన డబ్బు రోడ్లకోసము ఖర్చు పెడుతున్నారు. మిగిలిన విషయాలకు కేటాయించిన డబ్బు రోడ్లమీద ఖర్చు పెట్టడములేదు. కొంతప్రాంతాలకు ఉద్యోగస్థులు వెళ్లుతూ వస్తూ ఉంటారు. అక్కడ Co-operative Societies పెట్టడము, Schools స్థాపించడం వాటిని తనిఖీ చేయడము కొరకు ఆప్రాంతాలకు వెళ్లవలసివుంటుంది. కొన్ని ప్రాంతాల్లో paths కూడ వేస్తున్నాము. కాని ఈ కొండ ప్రాంతాల్లో రోడ్లు వేయకపోతే వర్షములవల్ల రాళ్లుపడి రోడ్లు పాడైపోతవి. వాటిమీద నడవడానికి వీలుండదు. అందుచే రోడ్లు అవసరమని అనుకొంటున్నాము. రోడ్ల కార్యక్రమము బాగుగా జరుగుచున్నది. Multi-purpose Projects రెండు ఆంధ్రప్రాంతములోను, రెండు తెలంగాణా ప్రాంతములోను ఏర్పాటు చేయడము జరిగింది. అందుచే వీరి ఆర్థిక పరిస్థితి బాగుపడుతుంది. స్కూల్సు విషయములో ఒక Special D. E. O. ను ఏర్పాటు చేయడము, Agricultural Officer ను ఏర్పాటుచేయడంవల్ల యీ కార్యక్రమాలు బాగుపడతవని ఆశిస్తున్నాము. ఇంక విముక్త జాతులవారు వున్నారు. వారిలో బంజారాలని, ఎరుకలని, ఏనాదులని తెలంగాణా ప్రాంతములో వున్నారు. ఈ కులముల వారే ఆంధ్ర ప్రాంతములలో కూడా వున్నారు. కొంత కాలము క్రితము ఆంధ్రప్రాంతములోని వారిని గిరిజనులుగా మార్చినాము. ఈప్రాంతముల వారిని కూడా గిరిజనులుగా మార్చాలి. వారికి, వీరికి సంబంధ బాంధవ్యాలు వున్నవి. ఆచార వ్యవహారములు ఒక్కటే. భేదమేమీ లేదు. అందుచే వీరిని గూడా గిరిజనులుగా మార్చినట్లయితే వీరిపరిస్థితులను కూడా బాగు పరచడానికి వీలు అవుతుంది. గిరిజనులకు కేంద్ర ప్రభుత్వమువారు రాజ్యాంగ చట్టములోని Article 270 ప్రకారము కొంత ధన సహాయము చేస్తున్నారు.

ఎరుకలు, ఏనాదులు మొదలైనవారిని గిరిజనులుగా మార్చకపోవడమువల్ల వారికి కొంత ఇబ్బంది కలిగినది, విముక్తజాతులకోసము కేటాయించబడిన డబ్బు నుండి, వీరి నిమిత్తం ఖర్చు చేయకూడదన్నారు. అందుచేత ప్రత్యేకంగా ధన సహాయం చేయవలసినదని భారత ప్రభుత్వమునకు వ్రాసినాము. వారు ఇంతవరకు జవాబు వ్రాయలేదు. ఒకటి రెండు పర్యాయములు విముక్తజాతులకు కేటాయించిన మొత్తములోనుంచి ఎరుకలు, ఏనాదులు మొదలైనవారికి కూడా కొంత

[13th March, 1958

ఖర్చు చేయవలసినదని వారు వ్రాసినప్పటికీ ఆ విధంగా చేయటానికి వీలుండదని మేము వ్రాశాము. వారికిచ్చిన కొంత మొత్తము అందులోనుంచీ కొంత ఇతరులకు ఖర్చుపెట్టినట్లయితే విముక్త జాతులకు కష్టమౌతుందనీ, వారి అభివృద్ధికి నిరోధక మవుతుందని కేంద్ర ప్రభుత్వమువారికి వ్రాశాము. వెనుకబడిన జాతుల వారి నిమిత్తం యీ పద్ధతిగా చేస్తున్న పని ముఖ్యంగా విద్యార్థులకు స్కాలర్ షిప్పు లివ్వడము, హాస్టల్సు పెట్టుకుంటే కొంత గ్రాంటు ఇవ్వడము. ఇదితప్ప యీ డిపార్ట్ మెంట్ క్రింద జరిగే ఇతర కార్యక్రమ మేదీలేదు. రెవిన్యూ డిపార్ట్ మెంట్ క్రింద ఒక కార్యక్రమము జరిగిఉండవచ్చు. భూమి ఇవ్వబడి ఉండవచ్చు. ఇతర సహాయము కూడ జరిగిఉండవచ్చు. హరిజనులకు బంజరు భూములివ్వడము మొదలైన విషయము రెవిన్యూశాఖవారు చేస్తారు. సహకార శాఖవారు కూడా కొంత సహాయముచేస్తున్నారు. ఈ జాతులవారి నిమిత్తము సహకార సంఘాలు ఏర్పర్చితే బాగుంటుందని అనుకుంటున్నాను. బీదవార సహకార సంఘాలుగా ఏర్పడినట్లయితే కొల్లేరు ప్రాంతములో ఉన్న భూమిని వారికి సాగుచేసుకొనే నిమిత్తం ఇచ్చుటకు ప్రయత్నంచేస్తాము. ఇంజన్ దారులను తొలగించవలెనసే అభిప్రాయమున్నది. శ్రీ కూర్మయ్యగారు వ్యవసాయ కూలీలపట్ల చాలా శ్రద్ధ, ఆశక్తి కలిగినవారగుటవలన వారు యీ విషయములో కృషిచేసి వ్యవసాయ కూలీల సహకార సంఘాలు ఏర్పాటు చేయించినట్లయితే తప్పకుండా ఆ భూములను ఆ సంఘాలవారికి ఇప్పించే ప్రయత్నం చేస్తామనీ, ఆ విషయంలో మా సంపూర్ణమైన సహకారము వారికి ఉండగలదని వారికి మనవిచేస్తున్నాను. హరిజనులు, వెనుకబడిన జాతులవారు పల్లెసీమలలో నివసిస్తున్నారు. వారు వ్యవసాయ కూలీలుగా జీవిస్తున్నారు. వ్యవసాయ కూలీలకు కనీస వేతనాలు చూపించే నిమిత్తము ఒక సంఘాన్ని వేసినట్లుగా చెప్పారు. వ్యవసాయ కూలీలపట్ల ఎంతో శ్రద్ధకలిగిన శ్రీ కూర్మయ్యగారిని ఆ కమిటీలో సభ్యునిగా వేయకుండాపోము. వేసినాము. వారు ఆ కమిటీ కార్యకలాపాలలో శ్రద్ధవహించి ఎటువంటి వేతనాలను కల్పించినట్లయితే వ్యవసాయ కూలీలకు గిట్టుబాటవుతుందో పరిశీలించి తమ నిర్ణయాన్ని ప్రభుత్వమునకు తెలియచేసినప్పుడు ప్రభుత్వము ఆ విషయములో న్యాయమైన నిర్ణయము తీసుకుంటుందని వారికి తెలియచేస్తున్నాను. ఇంతకన్నా విశేషంగా నేను సమయము తీసుకోవడం భావ్యంకాదేమో, గౌరవసభ్యులు చేసే సూచనలు, విమర్శలు విన్నతరువాత సమాధానము చెప్పగలను.

*SRI VAVILALA GOPALAKRISHNAYYA (Sattenapalli) :* I beg to move :

To reduce the allotment of Rs. 2,39,16,100 for Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

13th March, 1958]

To impress on the Government to expedite the proceedings to land acquisition to Harijans and Scheduled tribes and Vimukhta Jathis and also to the Backward classes.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To impress upon the Govt. to implement the Malayappan Report.

*SRI S VEMAYYA (Buchireddipalem - Reserved) :* I beg to move :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా, తాలూకా పెనుబర్తి గ్రామ హరిజనులకు ఇంఢ్ల స్థలము ఇప్పించుటలో జాప్యము చేయుచున్నందులకు.

*SRI B. DHARMA BHIKSHAM (Nakrekal) :* I beg to move:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హైదరాబాదు నగరంలోని, మరియు తెలంగాణాలోని కాస్మాపాలిటన్ హాస్టల్సు వెనుకబడిన జాతుల, షెడ్యూల్డుకేస్టు, విముక్త జాతుల హాస్టల్సుకు ప్రభుత్వమిచ్చు ధనసహాయం విద్యార్థులకు సరిపోవటంలేదు. ఉపోషాలుండాలిసి వస్తున్న విషయాన్ని చర్చించుటకుగాను.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులు, వెనుకబడిన జాతులవారు, మరియు పేద ప్రజానీకమునకు ఇండ్ల స్థలాలు ఇప్పించుటలో ఇండ్ల నిర్మాణం చేయించుటలోవిఫలత జెందినందులకు చర్చించుటకుగాను.

*SRI K. L. NARSIMHA RAO (Yellandu-General) :* I beg to move :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

షెడ్యూలు జాతులు, నిమ్నజాతులు వెనుకబడిన జాతులు మొదలగువారి అభివృద్ధికి తగినంత ధనాన్ని కేటాయించునట్లు చేయకపోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

అడవి ప్రాంతాలలో నివసించుచున్న కొండజాతులవారు అడవి కలపను ఉచితంగా అనుభవించు అవకాశం కల్పింపక పోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100.

కోయ ప్రజలకు భూములను కేటాయించి, ఎరువులు, విత్తనాలు, వ్యవసాయ పరికరాలు పశువులు సప్లయి చేయకపోవడం గురించి, వారి ఆర్థిక విధానాన్ని బాగుపర్చడానికి తగినంతగా తోడ్పడం గురించి.

To reduce the allotment of Rs. 2,32,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కోయ ప్రజల విద్యాభివృద్ధికి, ఆరోగ్యాభివృద్ధికి తగిన శ్రద్ధ తీసుకొనక పోవడం గురించి.

*SRI GOPIDI GANGA REDDY (Mudhole) :* I beg to move:
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజన గిరిజన విద్యార్థులకు సరియైన భోజన వసతులు మరియు స్కాలరు షిప్పులు ఇవ్వలేనందులకు.

*SRI B. NARASIMHA REDDY (Suryapeta-General) :* I beg to move :

To reduce the allotment of Rs. 2,39:16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సూర్యాపేట తాలూకాలో హరిజన ఇళ్ల స్థలాల సమస్య ఒక ఫార్సుగా తయారైనందుకు.

*SRI UPPAL MALCHUR (Suryapeta–Reserved) :* I beg to move :

To reduce thə allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, castes etc. by Rs. 100

గ్రామాలలో అంటరానితనపు నిర్మూలన కొరకు ప్రచారం, దానివల్ల కలుగుచున్న అవకతవకలగురించి, దానికొరకు అనవసరంగా డబ్బు దుర్వినియోగం గురించి.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సూర్యాపేట తాలూకా హరిజనులకు మంచినీటి బావులు లేక మురికి నీరు త్రాగి నానా రోగాలకు గురిఅవుతున్న హరిజన కుటుంబాలు అందుకు ప్రభుత్వ

13th March, 1958]

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సూర్యాపేట తాలూకా హరిజన ఇండ్ల స్థలాలు మంజూరి అయిన వాటిని ఇప్పటివరకు ప్లాటుచేసి ఇచ్చుటకు గ్రామ పెత్తనదారి వర్గపు ఆటంకం, ప్రభుత్వ ఉద్యోగుల వైఖరి గురించి.

To reduce the allotment of Rs, 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా హరిజనులకు ఇండ్ల స్థలాలు ఇచ్చుటలో ప్రభుత్వంవారిఉద్యోగుల పక్షపాతవైఖరి. ఇందు మూలంగా హరిజనులకు కలిగే కష్టనష్టాల గురించి.

*SRI S. VEMAYYA* : I beg to move:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా తరుణవాయి గ్రామ హరిజనులు క్రయము భరించెదమని చెప్పుచుండినను, వారి పొలములకు నీటికాలువను భూసంపాద చట్టము క్రింద వారికి కాలువను యేర్పాటు చేయుటలో జాప్యము జరుగుచున్నందుకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

ఆత్మకూరు తాలూకా, కారిమెర్ల గ్రామ ప్రాథమిక సాంఘిక సంక్షేమ పాఠశాలను హయ్యర్ ఎలిమెంటరీ స్కూలుగా మార్పు చేయుటలో జాప్యము జరుగుచున్నందుకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకా కలువాయి గ్రామ హరిజనులకున్నూ కోవూరు తాలూకా సిగ్గారెడ్డి పాలెం హరిజనులకు మంచినీళ్ళ బావిని, కోవూరు తాలూకా (1) వెంకనపురం (2) పోతిరెడ్డి పాలెం గ్రామ హరిజనులకు మంచినీళ్ల బావి, కోవూరు తాలూకా అన్నారెడ్డి పాలెం హరిజనులకు, పొది లిమిర్జాపేట హరిజనులకు మంచినీళ్ళ బావిని ఏర్పాటు చేయింపనందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా 1. ఊటుకూరు గ్రామ హరిజనులు రామస్వామిగుంటకు పోవుటకు డొంకను 2. విడువలూరు గ్రామ హరిజనులకు డొంకను 3. ఎల్లాయిపాలెంను మజరా రామాపురం గ్రామ హరిజనులు ఇతర

వెనుకబడిన జాతులకు బాసుమువ పూర్తిగ భరించగలమని చెప్పుచున్నప్పటికీ. భూసంపాద చట్టముక్రింద తమ భూములను యిప్పించుటలో జాప్యం జరుగుచున్నందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by . Rs. 100

నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా 1. ఏరమది మజరాపల్లెపాలెం 2. ఇస్కపాలెం మజరా జవ్వాది లక్ష్మీపురం వెనుకబడిన జాతులవారు ఇండ్లస్థలము భూసంపాదన చట్టముక్రింద యిప్పించినయెడల భూమి పూర్తి క్రయము చెల్లించుటకు సిద్ధముగా నున్ననూ ఇండ్ల స్థలమును ఇప్పించుటలో జాప్యము జరుగుచున్నందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా నెల్లూరు తాలూకా 1. నేడూరు మజరా అల్లెపోలు దారపు పల్లెపాలెం వెనుకబడిన జాతుల భూసంపాదన చట్టముక్రింద తమకు డొంకను సంపాదించినయెడల ఆ భూమి పూర్తి క్రయము భరించుటకు ఒప్పుకొన్ననూ వారికి డొంకను యేర్పాటు చేయుటలో జాప్యము జరుగుచున్నందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled tribes etc. by Rs. 100

నెల్లూరు తాలూకా 1. పరిణి 2. బీరంగుంట 3. ముట్టిపాడు 4. పెదపుతేరు 5. ఇనమడుగు 6. మానెగుంటపాడు 7. చెల్లాయిపాలెం 8. దామరమడుగు 9, బుచ్చిరెడ్డిపాలెం 10. దువ్వూరు 11. సిద్దిపురం 12 వెంగారెడ్డిపాలెం 13. దువ్వూరు మజర దిబ్బలమీద మాలవాడ హరిజనులకు ఇండ్ల స్థలము యిప్పించుటలో ఆలస్యము జరుగుచున్నందుకు.

*SRI KRISHNAMACHARI (Sangareddy-General)* : I beg to move:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సంగారెడ్డి, మెదకు జిల్లా కేంద్రములో ఇంతవరకు హరిజనవసతి గృహములకై భవన నిర్మాణము జరుగనందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కనీసము అన్ని జిల్లా కేంద్రములలోనయిన హరిజన బాలురకై వసతి గృహములను ఏర్పాటు చేయనందులకు.

13th March, 1958]

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by .Rs. 100

జిల్లాలలో గల హరిజన హాస్టల్సుకు సరిపోవు గ్రాంట్సు మంజూరు చేయనందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు, షెడ్యూల్డు కులాలవారికి గ్రామాలలో ఇండ్ల వసతి కల్పించుటలో ప్రభుత్వ అధికారులు చేయుచున్న ఆలస్యమును చర్చించుటకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, castes etc. by Rs. 100

హరిజనులకు, షెడ్యూల్డు కులాలవారికి చిన్న చిన్న పరిశ్రమలు నేర్పుటకై ప్రోత్సాహము, సహాయము చేయనందులకు.

*SRI GOPIDI GANGA REDDY*: I beg tomove:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు అస్పృశ్యతను నివారణ చేయలేనందులకు,హరిజనులకు మరియు గిరిజనులకు గృహవసతులను ఏర్పాటు చేయలేనందులకు.

*SRI M. SATYANARAYANA RAJU (Cheepurupalli-General)*: I beg to move:

For not providing house-sites to Harijans.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

For not providing drinking water wells to backward classes.

*SRI B. SRIRAMAMURTHY* : I beg to move:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To discuss the failure of the Government to provide house-sites, drinking water facilities and free medical aid, boarding facilities and free medical aid, boarding and lodging facilities for harijans.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కొండజాతి ప్రజలనుండి పశువుల పుల్లరి వసూలు నిలిపివేసి అడవి పంటలను అనుభవించే ఆటవిక ప్రజల హక్కును గుర్తించి విరివిగా రుణాలు మంజూరు చేయుట ద్వారా వ్యవసాయమునకు ప్రోత్సహించు విధానము లేనందున ప్రభుత్వమును విమర్శించేందుకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To criticise the failure of the Government to liquidate unemployment and under-employment of the scheduled Castes and Tribes.

*SRI A. VENKATARAMA RAJU (Roiole-General)* : : I beg to move :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Castes etc. by Rs. 100

వెనుకబడిన తరగతుల విద్యార్థులకు ఎక్కువ మార్కులు ప్రాతిపదికగా తీసుకొని ఆర్థిక సహాయం చేస్తున్నామంటూ ఆ ప్రాతిపదికను భగ్నపరచి ఆశ్రిత పక్షపాతం చూపుతున్నందుకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Castes etc. by Rs. 100

ఇంటి స్థలాలు కేటాయించి ధనాన్ని ఖర్చుపెట్టినచోట కూడా స్థలాలను విడదీయుటకు 3 సం. రాలుగా ఆలస్యంచేస్తూ సుమారు 25 వేల రూపాయలను జీవం లేని ధనంగా తయారు చేస్తూవున్నందుకు.

*SRI G. RAMULU (Huzurabad-Reserved)* I beg to move:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by

అస్పృశ్యతా నివారణ చురుకుగా జరుగనందుకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు ఇండ్ల స్థలములుయిచ్చే విధానములో ఆలస్యము జరిగినందుకు.

*SRI D. NARSAIAH (Yellandu-Reserved)* : I beg to move:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

వెనుకబడ్డ తరగతుల ప్రజల విద్యాభివృద్ధికి కనీసం వారి గుడిశలలో రాత్రి పాఠశాలలు నెలకొల్పనందుకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

లంబాడీ, ఎరుకల, యానాది మొదలగు వెనుకబడ్డ తరగతుల ప్రజలను అన్ని రంగాలలో వారిమీద సాగుతున్న దోపిడీలను అరికట్టనందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

13th March, 1958]

హరిజనుల బావుల మరమ్మతులకు మంజూరి అయిన సొమ్మును వారి ప్రతి నిధులకే యివ్వక గ్రామాధికారులకు మాత్రమే యిచ్చి చేయించ బూనుకొం టున్నందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for Welfare of Scheduled Tribes, Castes etc., by Rs. 100

లంబాడీ, ఎరుకల మొదలగు వెనుకబడ్డ తరగతుల ప్రజల అభివృద్ధికి ఎలాంటి శ్రద్ధ తీసుకోక పోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,39,16,100 for Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు మంచినీటి బావులు తీయించుటకు, మరమ్మతులు చేయించు టకు సంవత్సరాల తరబడిగా జాగుచేస్తున్నందులకు.

To reduce the allotment of Rs. 2,39,16,100 for Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు యిండ్లస్థలాలు యిప్పించుటలో మంజూరీచేసి పంపకం చేయు టలో ప్రభుత్వం తగినంత శ్రద్ధ కనబరచక పోవడం గురించి.

To reduce the allotment of Rs. 2,39,16,100 for Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనుల యిండ్ల నిర్మాణమునకు ప్రభుత్వం చర్యలు తీసుకోక పోవడం గురించి.

*MR. SPEAKER* : All these cut motions are now before the House.

ఈనాడు శాసన సభలో వివిధ పక్షాల వారికి ఉన్న సంఖ్యాబలంబట్టి వారికి యీ డిమాండుపై చర్చించుటకు టైము కేటాయించదలచాను. చాలా మంది సభ్యులు తమకు అవకాశమివ్వమని కోరుతున్నారు. ఆ విధంగా అందరికి అవకాశమివ్వడం సాధ్యంకాని విషయం. 215 మంది కాంగ్రెసువారు, 37 గురు పి. డి. యఫ్. వారు, 9 మంది నేషనలిస్టువారు, 19 గురు సోషలిస్టులు, 9 గురు ఇండిపెండంట్సు, ప్రజాసోషలిస్టుపార్టీ, ఆంధ్రప్రజాపార్టీ, షెడ్యూల్డుకాస్టుఫెడరేషను పార్టీలకు చెందిన ఒకొకరు ఉన్నారు. కాబట్టి మొత్తం చర్చకు కేటాయించిన 220 నిమిషాలలో మూడింట రెండు వంతులు కాంగ్రెసుపార్టీవారికి, తక్కిన ఒక వంతు ప్రతిపక్షాలవారికి కేటాయించ దలచాను.

శ్రీ పిల్లమఱ్ఱి వేంకటేశ్వర్లు (నందిగామ) :- పార్టీలసంఖ్యా బలాలబట్టి కాక హాజరయిన సభ్యుల సంఖ్యను బట్టి టైము కేటాయించడం మంచిదని అనుకుం టాను. సంఖ్యాబలమెంతున్నా హాజరుకాని వారిచేత మాట్లాడించలేము కదా.

మిష్టరు స్పీకరు:- హాజరయిన వారి సంఖ్యబట్టి కాక పార్టీల సంఖ్యాబలం బట్టి కేటాయించ దలచాను.

శ్రీ పి. గున్నయ్య (పాతపట్నం-రిజర్వుడు) :- కొంతమంది సభ్యులు అయిదారు పర్యాయములు మాట్లాడుటకు కూడా అవకాశం చిక్కింది. మాబోటి వాండ్లకు ఇంకా అవకాశంరాలేదు. దయవుంచి యీ డిమాండుపై మాట్లాడ్డానికి మాకు అవకాశమిప్పించమని కోరుతున్నాను.

శ్రీ వి. రామారావు (షాహాబాద్-రిజర్వుడు):- హరిజన సంక్షేమానికి సంబంధించిన యీ బిల్లుపై మాట్లాడడానికి హరిజనులందరకు అవకాశ మివ్వకోరుతున్నాను.

మిష్టరు స్పీకరు:- ఏ ఒక్క వర్గానికని ప్రత్యేకించి అవకాశమివ్వడం సాధ్యంకాదు. మీ మీ పార్టీ నాయకులు ఇచ్చిన జాబితాలలో పేర్కొన్న వారికి అవకాశమీయబడుతుంది.

శ్రీ ఎ. సి. సుబ్బారెడ్డి (నెల్లూరు) :- అధ్యక్షులవారు తీసుకున్న టైము కాకుండానే మిగతావారికి టైమిస్తారా?

మిష్టరు స్పీకరు:- ఇది మొత్తం టైములోని భాగం.

శ్రీ యస్. వేమయ్య:-అధ్యక్షా! దీనికి (హరిజన సంక్షేమానికి) యీ బడ్జెటులో కేటాయించిన డబ్బు, మొత్తం రిక్వైరుమెంట్స్ అన్నింటికీ సరిపోయేట్లు లేదు. కనీస కోర్కెలకుకూడా చాలడం లేదు. జనాభా దృష్ట్యా, అభివృద్ధి కార్యక్రమాల దృష్ట్యా, ప్లాన్ దృష్ట్యా చూచినా యీ కేటాయింపులు చాలా తక్కువని మనవిచేస్తున్నాను. దీనిని యింకా ఎక్కువచేయించుటకు మంత్రిగారు గట్టిగా ప్రయత్నము చేయవలెనని కోరుతున్నాను.

1955 లో ఒక కమిటీని—హరిజనులకు యిచ్చిన కన్సెషన్సు ఎంతవరకు ఉపయోగించుకొన్నారనేది విచారణ చేయుటకు-నియమించారు. వారు ఒక నివేదికను ప్రభుత్వానికిచ్చారు. అందులోని సూచనలను ప్రభుత్వం ఎంతవరకు అంగీకరించినదో, యింకా ఎన్ని అంగీకరించదలచినచో మంత్రిగారు సూచనప్రాయంగానైనా చెప్పలేదు. 1948 లో కూడా ఒక కమిటీని వేశారు. వారు చేసిన ముఖ్యమైన సిఫార్సులుకూడా అంగీకరింపలేదు. మంత్రిగారు ఈ విషయమై ఏమీ చెప్పనందుకు చింతిస్తున్నాను. అంటరానితనముగురించికూడా ఏమీ చెప్పలేదు.

అంటరానితనము పల్లెలలో ఎంతో విపరీతముగా ఉన్నది. సెంట్రల్ ఆక్టునుగాని, యితర ఆక్టున్గాని ఏమీ పనిచేయుటలేదు. బావులలో నీరు తోడుకోననివ్వకుండుట, హోటల్సులోనికి రానివ్వకుండుట-యిటువంటి పరిస్థితులగురించి పీరియాడికల్‌గా దర్యాప్తుచేస్తున్నారా అని అడుగుతున్నాను. ప్రొహిబిషన్ విష

13th March, 1958]

యం.లో కేసులగురించి ఏవిధంగా దర్యాప్తు జరుగుతున్నదో, అదేవిధంగా అస్పృశ్యత విషయమైకూడా ప్రభుత్వం ఎందుకు చేయుటలేదని మంత్రిగారినీ అడుగుతున్నాను. మనము ఈనాడు 1958 వ సంవత్సరములో ఉన్నా, హరిజన బాలబాలికలను, పాఠశాలల్లో చేర్చుకొనకపోవుట శోచనీయం. నెల్లూరు తాలూకా పరకాయ్యపూడి అనే గ్రామంలో హరిజన పిల్లలను చేర్చుకొనుటలేదు. ఈ విషయం మంత్రిగారి దృష్టికి తీసుకువచ్చాను. దానిమీద చర్య తీసుకోవాలి. అంటరానితనం రూపుమాపుటకు హరిజన హాస్టల్సులో హరిజనేతరులనుకూడా చేర్చుకొనుటకు ప్రభుత్వం ఒక విధానం అవలంబించింది. మంచిదే. కాని, యానాది, ఎరుకుల, యిటువంటివారికున్న హాస్టల్సులో హరిజనులను ఎందుకు చేర్చుకొనుటలేదు?

శ్రీ డి. సంజీవయ్య:— అందరినీ కలపవలెననే ఉద్దేశంతోనే అస్పృశ్యతా నివారణ కార్యక్రమం జరుగుతోంది. హరిజన హాస్టల్సులో వెనుకబడ్డజాతుల వారిని, వెనుకపడిన జాతులవారి హాస్టల్సులో హరిజనులను చేర్చుకోవాలని చెబుతున్నాము.

శ్రీ యస్. వేమయ్య:— నెల్లూరులో ఉన్న యానాది కాలనీలో యానాదులనుతప్ప హరిజనులను చేర్చుకోకూడదని ఆ మేనేజిమెంట్ పట్టుపట్టుతున్నారు. ఈ విషయం ప్రభుత్వ దృష్టికి తెచ్చినా ఎందుకు చర్య తీసుకొనలేదని అడుగుతున్నాను. ప్రభుత్వం శీతకన్ను వేసి పనిచేస్తున్నదని వారి దృష్టికి తెస్తున్నాను.

విద్య విషయంలో ప్రభుత్వం సహాయం చేస్తున్నమాట నిజమే. కాని అది సక్రమపద్ధతిలో జరుగుటలేదు. హాస్టల్సు మానేజ్‌మెంట్ సరిగా జరుగుటలేదంటారు. జరిగేవాటిల్లో ఎంక్వైరీ చేస్తున్నామంటారు. ఇది లేకుండా స్కాలర్‌షిప్పు విషయంలో సరైన సహాయం సకాలంలో చేయాలని మనవిచేస్తున్నాను. తెలంగాణాలో కొన్ని హాస్టల్సు రికగ్నైజ్ చేయడానికి పూనుకున్నామని మంత్రిగారు చెప్పారు. సంతోషమైన విషయం. అదేవిధముగా అన్నీ రికగ్నైజ్‌చేసి, ప్రారంభం చేసిన సంవత్సరమునుంచే గ్రాంట్సు యివ్వాలి. ఒక సంవత్సరం హాస్టల్ నడిపితే గాని, రెండవ సంవత్సరం recognise చేయమనే విధానం మానివేయాలి. మీడ్ డే మీల్సు విషయంలో లోగడ cash dolls విధానం ఉంటే, యిప్పుడు అది లేదు. పల్లెలలో మిడ్ డే మీల్సుకన్నా కాష్ డోల్సు యిస్తేనే బాగుంటుందని అడుగుతున్నారు. ఈ విషయం ప్రభుత్వం దర్యాప్తుచేయించాలని అడుగుతున్నాను. కాలేజీ వగైరా చదువుల విషయంలో ఫ్రీ ఎడ్యుకేషన్ యిస్తున్నామని ప్రభుత్వం చెబుతున్నారు. కాని స్పెషల్ ఫీజు, కాషన్ ఫీజు కట్టుకోవలసివస్తోంది. ఈ ప్రత్యేక ఫీజులు కట్టుకోలేక అనేకమంది విద్యార్థులు నిలిచిపోతున్నారు. కాబట్టి ఫ్రీ ఎడ్యుకేషన్ అంటే ఈ ఫీజులన్నీ ఖచ్చితంగా తీసివేయాలి.

[13th March, 1958

స్కాలరుషిప్పు యిచ్చే విషయంలో లోయరు క్లాసులలో ఒకసారి హైయ్యరు క్లాసులలో ఒకసారికంటె ఎక్కువ తప్పితే యివ్వము అని అంటున్నారు. అట్లా కాకుండా కనీసం ఒక క్లాసులో రెండు సంవత్సరములు ఫైయిల్ అయినా స్కాలర్ షిప్ యిచ్చుటకు ప్రభుత్వం ఆలోచించవలెనని కోరుతున్నాను.

శ్రీ డి. సంజీవయ్య:—ఫస్టుఫారం నుంచి మూడవ ఫారమువరకు ఒకసారి, నాల్గవ ఫారమునుంచి యస్. యస్. యల్. సి. వరకూ ఒకసారి ఫైయిల్ కావచ్చును. ఇంజనీరింగ్‌లో ఒకసారి ఫేయిల్ కావచ్చును. యమ్. బి బి.యస్.లో రెండుసార్లు అని—యీ విధంగా రూల్సు ఉన్నవి. కాబట్టి అంతకంటె ఎక్కువ సార్లు ఫెయిల్ అయ్యేవారిని క్రాఫ్ట్సులో ట్రైనింగ్, టెక్నికల్ ట్రైనింగ్ యిచ్చి పంపించటం మంచిది.

శ్రీ యస్. వేమయ్య:— నా సూచనకూడా అదే, లోయరు ఫారమ్సు, హయ్యరు ఫారమ్సు అని కాకుండా ఒక క్లాసుకు రెండు సంవత్సరములు యివ్వాలని చెబుతున్నాను. ఉద్యోగాలకూ వాటికీ గ్రామాధికారులనుంచి, పై అధికారులనుంచి సర్టిఫికేట్సు తీసుకు రమ్మంటున్నారు. గ్రామాధికారులు యివ్వరు. పై అధికారులు ఆర్. ఐ., తాసిల్దారు, డిప్యూటీ కలెక్టరు, కలెక్టరు-వద్దనుంచి సర్టిఫికేట్సు తెచ్చుకొని ఉద్యోగాలకు దరఖాస్తులు సకాలములో పంపుకొనుటకు కష్టముగా ఉన్నది. ఈ విషయంలో విద్యార్థులకుగాని, ఉద్యోగాలకు పోయేవారికిగాని, సర్టిఫికేట్సు విషయంలో ఏ విధమైన ఆలస్యం జరగకుండా ఏర్పాటు చేయవలెనని కోరుతున్నాను.

హరిజనులకు, వెనుకపడిన జాతులవారికి ప్రభుత్వం యింకొక ఘోర అపరాధం చేసింది. ఉపాధ్యాయ వృత్తికి హైయ్యర్ గ్రేడ్ ట్రైనింగ్ ఉండేది. అది తీసేసి అందరూ సెకండరీ గ్రేడ్ ట్రైనింగ్ కావాలన్నారు. ఇది అందరికీ సాధ్యం గాదు. హైయ్యరు గ్రేడు ట్రైనింగ్ ఖచ్చితంగా ఉంచాలని కోరుతున్నాను ఆ ట్రైనింగ్ పూర్తి చేసుకొని ఏదైనా ఉపాధ్యాయ వృత్తిలో చేరుటకు వీలుగా ఉంటుంది కాబట్టి, తప్పకుండా పెట్టాలని కోరుతున్నాను.

హరిజనులకు లీగల్ ఎయిడ్ ఇస్తామనేది, కేవలం కాగితంమీదనే ఉన్నది. ప్రత్యేకంగా హరిజనులకుగాని, ఇతరులకుగాని లీగల్ ఎయిడ్ అందుబాటులో లేదని మనవి చేస్తున్నాను. లీగల్ ఎయిడ్ ఖచ్చితంగా అమలు జరపటానికి ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకోవాలి. క్రిమినల్, సివిల్ కేసులకు కూడా లీగల్ ఎయిడ్ అందజేయాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

మినిమమ్ వేజెస్ యాక్టు 1948 వ సంవత్సరంలో పాసైంది. అది యాక్టు అయి, పది సంవత్సరాలైనా, దానిని ఇంతవరకు అమలు జరపలేదు. మంత్రిగారు

13th March, 1958]

చెబుతూ "దీనికి ఏదో చర్యలు తీసుకొంటున్నామని" అన్నారు. వారు ఏమి చర్యలు తీసుకొంటున్నారో నాకు బోధపడటంలేదు. నామమాత్రంగా పదిహేను గ్రామాలలో ప్రవేశపెడుతున్నామని చెబుతున్నారు. ఆ పదిహేను గ్రామాలు అయినా మంచి డెల్టా ఏరియాలో ఉన్న గ్రామాలుకాదు. ఎక్కడో మూరుమూల ఉన్న గ్రామాలు తీసుకొని అమలు చేయటానికి ప్రయత్నిస్తున్నారు. "దీని విషయంలో ప్రభుత్వంయొక్క విధానమిది," అని ఖచ్చితంగా చెప్పటానికి వీలు లేకుండా ఉంది. మేము దీనినిగురించి ఎప్పుడు అడిగినా, "రెవిన్యూబోర్డును రిపోర్టు అడిగియున్నాము" అని సంజాయిషీ చెబుతున్నారు. అంతేగాని, "దానిని గురించి ఇంత ప్రోగ్రెస్ జరిగింది, ఇక్కడ అమలు జరిపాము'' అని సరైన సంజాయిషి చెప్పటంలేదు.

శ్రీ డి. సంజీవయ్య : అందుకనే, ఆ రిపోర్టుకొరకు కాచుకొని ఉండకుండా, ఒక కమిటీని వేసినాము. ఆ కమిటీవారు సిఫార్సులు చేయటం, ప్రభుత్వంవారు అంగీకరించటం జరుగుతుంది.

శ్రీ యస్. వేమయ్య : మేము ఎప్పుడు యీ విషయంగురించి అడిగినా, కేంద్ర ప్రభుత్వంతో ఆలోచిస్తున్నామని చెబుతారు. కావాలనే, కేంద్ర ప్రభుత్వం, రాష్ట్రప్రభుత్వం యీ విషయంలో ఆలస్యం చేస్తున్నారని నేను భావిస్తున్నాను. ఆ చట్టాన్ని పదేపదే పొడిగించటమే జరుగుతోందిగాని, వ్యవసాయ కూలీలకు వెంటనే యీ మినిమమ్ వేజెస్ యాక్టును వర్తింపజేయటానికి పూనుకోవటంలేదు. రైతులకు గిట్టుబాటైన ధర ఉండాలి అని, ధాన్యం ధరలు పెరగాలని ఒకవైపున ఆందోళన చేస్తున్నారు. ఆవిధంగా ధరల గురించి ఆందోళన చేస్తున్నప్పుడు, రెండవవైపున యీ వ్యవసాయ కూలీలకు కనీసవేతనాలను నిర్ణయించాలని ప్రభుత్వం ఎందుకు ఆలోచించటంలేదని ప్రశ్నిస్తున్నాను. రైతులకు గిట్టుబాటు ధరలు ఉండాలని చెప్పే యీ ప్రభుత్వం వ్యవసాయ కూలీలకు కనీసవేతనాలు నిర్ణయించడం వెంటనే ఎందుకు దృష్టిలోకి తీసుకోవటంలేదో గట్టిగా అడగవలసి ఉన్నది.

వెయిట్స్ అండ్ మెజర్స్ యాక్టు 1935 వ సంవత్సరంలో వచ్చింది. కాని ఇప్పటికి గ్రామాలలో పిచ్చముంతలుగాని, ఫాల్స్ వెయిట్స్‌గాని పోలేదు. ఫాల్స్ వెయిట్స్ అండ్ మెజర్స్‌ను తీసివేయటానికి ప్రభుత్వం ఇంతవరకు చర్య తీసుకోలేదని మనవి చేస్తున్నాను. కాబట్టి ప్రభుత్వం వెంటనే వాటిని పోగొట్టటానికి చర్యలు తీసుకొని సరైన కొలతలు జరిగేదానికి ప్రయత్నించాలి.

హరిజనులకు ఇళ్లస్థలాలు విషయంచూస్తే, ఇంతవరకు ఆ సమస్య పరిష్కరింపబడలేదు. దీనిని గురించి మంత్రిగారు చెబుతూ "ఇది చాలా పెద్ద సమస్య,

ఇది కేంద్ర ప్రభుత్వంతో సంప్రదించి చేయవలసిఉన్నది.'' అని అన్నారు. ప్రభుత్వం ఇళ్లస్థలాలు హరిజనులకు ఇవ్వటం అన్నది ఎట్లాగు జరగటంలేదు. కనీసం ప్రభుత్వంయొక్క స్థలాలైనా వారికి ఇస్తున్నారాఅంటే లేదు. ప్రభుత్వంయొక్క స్థలాలు ఉన్నాయి. పోరంబోకు స్థలాలు ఉన్నాయి. ఎలాంటి ఆక్షేపణలేని పొలాల్లో హరిజనులు ఇళ్లు కట్టుకొంటూంటే, ఆ పొలాలకు పట్టాలు ఇప్పించటానికి యీ ప్రభుత్వమునకు బుద్ధిపుట్టటంలేదు. ఒక ఉదాహరణగా తీసుకొంటే, నెల్లూరుజిల్లా, కొవ్వూరు తాలూకా పెదపుత్తేడు గ్రామంలో, ఎన్నో సంవత్సరాల నుండీ కొన్ని స్థలాల్లో హరిజనులు ఇళ్లు కట్టుకొని ఉంటున్నారు. కాని ఆ స్థలాలకు వారికి పట్టాలు ఇవ్వటంలేదు. ఆ భూమి ఎవరో రైతుపేర ఉన్నప్పటికీ, వీరే శిస్తుకడుతున్నారు. అవి ఊరికే ట్రాన్స్‌ఫర్ ప్రపోజల్స్. ఆ సమయంనుంచి గాని, మరేవిధంగాగాని, గ్రామసత్వం పోరంబోకుకు ట్రాన్స్‌ఫర్ చేసేదానికి ప్రభుత్వం ఏళ్ల తరబడిగా ఆలస్యం చేస్తోంది. అట్లాగే, పాపిరెడ్డిపాలెం గ్రామం, జవ్వాజి లక్ష్మీపురం, కుసుమ హరిజనపాలెం, విడవలూరు, రామాపురం, ఊటుకూరు, తరుణవాయి గ్రామాలలో కూడ జరుగుతోంది. ''ఇదంతా ఆలస్యం అవుతోంది. ప్రభుత్వం డబ్బు భరించే పరిస్థితిలోలేదు. కాబట్టి మనం కొంత డబ్బు ఇస్తే తొందరగా పని అవుతుందని'' నేను వాళ్లతో చెప్పి, ప్రోత్సాహపడ్డాను. వారు "మేము పూర్తి ధర భరిస్తాము; మాకు దారులు, డొంకలు, ఎక్వయిర్ చేసి ఇవ్వాలి'' అని ప్రభుత్వాన్ని కోరారు. నేనుకూడా మంత్రిగారికి "ఇది సంవత్సరాల తరబడిగా ఆలస్యం జరుగుతోంది'' అని ఒక డి. ఒ. లెటర్ వ్రాసి ఇచ్చాను. డబ్బు పూర్తిగా భరిస్తామని హరిజనులు చెప్పినాకూడ, వాళ్లకు కావలసిన దారులు, డొంకలు, స్మశానం ఇవ్వటానికి ఆలస్యం చేస్తున్నారంటే, ఎంత నిర్లక్ష్యంగా యీ ప్రభుత్వంయొక్క మిషనరీ నడుస్తోందో అర్థం చేసుకోవచ్చును. నేను చెప్పిన యీ గ్రామాలలో ప్రజలు పూర్తిగా డబ్బు భరిస్తామన్నారు కాని ఇప్పటివరకు ఆ దార్లు వగైరాలీసి ఇవ్వటానికి ప్రభుత్వం పూనుకోలేదు.

మంత్రిగారు చెబుతూ, హరిజనులు ఇళ్లు కట్టుకోటానికి, అడవులలోనుండి కలప తెచ్చుకోటానికి అవకాశం కల్పిస్తామన్నారు. కాని, ఒక విషయం నేను మంత్రిగారి దృష్టికి తీసుకువస్తున్నాను. లోగడ బ్రిటీషు ప్రభుత్వం ఉన్నప్పుడే, ఇళ్లు కట్టుకోటానికి తాటిమాను కొనుక్కోవాలంటే, దీనికి ప్రభుత్వరేటు 5 రు.లు ఉండేది. అర్థరేటు 2-4-0 ఉండేది. కాని యీనాడు తాటిచెట్టుయొక్క ధర 7-8-0 వరకు పెంచింది. ఆవిధంగా పెంచి, పేదలకు ఇళ్లు కట్టుకోవటానికి ఎలా ఆస్కారం అవుతుందని ప్రభుత్వం భావిస్తోందో నాకు అర్థంకాదు. కాబట్టి, ప్రభుత్వం తక్షణమే యీ రేటును లోగడఉన్న రేటుకు తగ్గిస్తే, హరిజనులుగాని, ఇతర పేదవారుగాని ఇళ్లు కట్టుకోటానికి ఆస్కారం ఉంటుందని చెబుతున్నాను.

13th March, 1958]

కాబట్టి, మంత్రిగారు పునరాలోచించి యీ తాటిచెట్టు ధర తగ్గించాలని మనవి చేస్తున్నాను.

మన రాజ్యాంగంలో చెప్పిన సూత్రాల ప్రకారంగా మనం హరిజనులను సాంఘికంగా, ఆర్థికంగా అభివృద్ధిలోనికి తీసుకురావలసి ఉంది. ఆ విధంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు పనిచేయాలని రాజ్యాంగం నిర్దేశించింది. హరిజనులను ఆర్థికంగా అభివృద్ధి పర్చటానికి యీ ప్రభుత్వం చేస్తున్న స్కీము ఇంతవరకు నాకు కనుపించలేదు: అని గట్టిగా నమ్ముతున్నాను. లోగడ బ్రిటిష్ ప్రభుత్వం ఉన్నప్పుడే 1921 వ సంవత్సరంలో లేబరుడిపార్టుమెంటు 'స్థాపించి, పేదవాళ్ల ఆర్థిక పరిస్థితి బాగుచేయటానికి, వాళ్ళకు కొన్ని భూములు కేటాయించటం జరిగింది. వాటిని రిజర్వులాండ్స్ అంటారు. 'డిప్రెస్డ్ క్లాస్ లాండ్స్' అనే పేరుతో ఆ భూములను రిజర్వు చేశారు. ఆ విధంగా భూములను రిజర్వుచేసి, డిప్రెస్డ్ క్లాస్ పీపుల్ కు, సెట్లర్స్‌కు ఇచ్చారు. కాని యీ రిజర్వ్ చేసిన భూములన్నీ గొప్ప ఆస్తిగల వారి చేతుల్లోకి, కేస్ట్‌హిందూస్ చేతుల్లోకి పోయాయి. కాని బోర్డు స్టాండింగ్ ఆర్డరు 15, 38 పేరాగ్రాఫ్ లలో ఇవన్నీ రెస్యూమ్‌చేసి, తక్షణమే హరిజనులకు ఇవ్వాలని నిర్దేశింపబడి, బోర్డు స్టాండింగ్ ఆర్డర్స్ ప్రకారంగా వారియొక్క ఆర్థిక విధానాన్ని చక్కపరచటానికి, మన మంత్రిగారైన సంజీవయ్యగారు ఎలాంటి కృషి చేయలేదని నేను చెప్పగలను. హరిజనులకు సంబంధించిన విషయాలు చదవటానికి వారు గట్టిగా పనిచేయలేదు.

శ్రీ డి. సంజీవయ్య:- ఊరికే జనరల్‌గా చెప్పేదానికన్నా, ఫలానా ఊళ్ళో ఫలానా డి. సి. లాండ్స్ హరిజనులకు ఇవ్వకుండా రైతులకు, షావుకార్లకు ఇచ్చారని స్పష్టంగా చెబితే, ఒక్కొక్క దానిమీద చర్య తీసుకోవచ్చును గాని, ఊరికే జనరల్‌గా చెప్పినందువల్ల లాభంలేదు. ఎక్కడ ఇచ్చారు? ఎవరికి ఇచ్చారు?

శ్రీ యస్. వేమయ్య:– నేను ఒక జనరల్ పాలసీగా చెప్పటంలేదు. నేను మద్రాసు అసెంబ్లీలో ఉన్నప్పటినుండి, యీ విషయం చెబుతున్నాను.

శ్రీ డి. సంజీయ్య : ఫలానా ఊర్లో ఇది డి, సి. లాండ్, దీనిని ఫలానా వారికి ఇచ్చారని, ఒక ఇన్‌స్టెన్స్ చెప్పండి.

శ్రీ యస్. వేమయ్య : అల్లూరులో ఒక లాండ్ క్రిమినల్ ట్రయిబ్స్‌కు రిజర్వు చేశారు. ఇప్పుడు అల్లూర్ గ్రామంలోని లాండ్ కేస్ట్ హిందూస్ చేతుల్లోను, ధనవంతుల చేతుల్లోను ఉంది. ప్రభుత్వం ఇంతవరకు వాటిని రెజ్యూమ్ చేసేందుకు చర్యతీసుకోలేదు. ఇదేవిధంగా రావాలం, రాపూరు తాలూకాలోని రాచూరు, నా నియోజకవర్గంలోని బుచ్చిరెడ్డిపాలెం ఫిర్కాలోని చాలా గ్రామాలు, పెద పుత్తేడు గ్రామం, ఇప్పుడు నేను నివసించే గ్రామంలలో జరుగుతున్నది. ఇప్పుడు

[13th March 1958

అక్కడ లాండ్ మూడు వేల దాకా చేస్తుంది. అది యీనాడు కేస్ట్ హిందూస్ చేతుల్లోఉంది. ఆ భూమి resume చేసి హరిజనులకు, ఇతర జాతులవారికి ఇవ్వ టానికి అక్కడ ఆఫీసర్స్ ఇంతవరకు ఏలాంటి చర్య తీసుకోలేదు. నా నియోజక వర్గంలోని రేపాలగ్రామంలో యీక్రింద తెలుపబడిన సర్వేనెంబర్లుగల భూములు ఇదివరకు హరిజనులకు ఇచ్చినప్పటికీ, ఇప్పుడు అవి వారిచేతులలో లేకుండా ఇతరుల చేతులలో ఉన్నాయి వాటిని గురించి యీప్రభుత్వం వెంటనే చర్యలు తీసుకొని తిరిగి హరిజనులకు ఇప్పిస్తుందా అని ప్రశ్నిస్తున్నాను.

684 సర్వేనెంబరు — 1 మొదలుకొని 4 వరకు; సబ్‌డివిజన్స్;
685, 691, 701, 703, 723, 740, 741, 742, 743 లో 8, 744 లో 3, 751, 752, 754, 755, 760, 760 లో 3, 4, 5 .........

**ఆర్థిక మంత్రి (డాక్టర్ బి. గోపాలరెడ్డి)** : అవి అన్నీ ఏమిటి ?

**శ్రీ యస్. వేమయ్య** : అవి సర్వేనెంబర్లు. 760 లో 1, 2 భిన్నాలు; 761 లో 2 వ భిన్నం — ఇవన్నీ ఇదివరకు హరిజనులకు రిజర్వుచేసిన భూములు. ఇవన్నీ మంచి మాగాణి భూములు. వారియొక్క ఆర్థికబాధలు గుర్తించి, ఇది వరకు బ్రిటిష్‌వారు వారికి ఆ భూములు ఇచ్చారు. ఇవాళ ఆ భూములు వాళ్ల చేతుల్లోలేక, ఇతరుల చేతుల్లోకి పోయాయి. ఆ భూములను తిరిగి హరిజనులకు ఇప్పించటానికి యీ ప్రభుత్వం ఏ పథకాలు చేస్తున్నదని మంత్రిగారిని సూటీగా అడుగుతున్నాను. ఇప్పుడు డిసఫారెస్టు చేస్తున్నారు. అందులో కొంత భూమి హరిజనులకు ఇవ్వాలని బోర్డు స్టాండింగ్ ఆర్డరులో ఉంది. అదే విధంగా ఢేంక్ బెడ్ లాండ్స్ ఉన్నాయి, ఎటాన్‌డెడ్ ఢేంక్స్ ఉన్నాయి. వీటిల్లో కొంత భాగం హరిజనులకు రిజర్వుచేసి ఇవ్వాలని ఖచ్చితంగా బోర్డు స్టాండింగ్ ఆర్డర్స్‌లో నిర్దే శించబడిఉంది. ఆ భూమినంతా రాజకీయబాధితులకు పంచిపెడుతున్నారు గాని, హరిజనులకు ఆ భూమి రిజర్వు చేయటానికి యీ ప్రభుత్వం పూనుకోలేదు. హరి జనులయొక్క ఆర్థికపరిస్థితులను బాగుచేయటానికి ఇదివరకు ఆ భూములు వారికి ఇవ్వబడ్డాయి. మంత్రిగారు ఆ బోర్డు స్టాండింగ్ ఆర్డర్స్‌ను చదివి, వాటిని ఇంప్లి మెంటు చేయటానికి పూనుకోలేదని మనవి చేస్తున్నాను.

అదేవిధంగా, ప్లానింగ్ పనుల క్రింద కొంత డబ్బు ప్రజలు ఇస్తేగాని బావులు త్రవ్వించమంటున్నారు. "మీరు డబ్బు ఇస్తేగాని, మీకు బావులు త్రవ్వించము" అని అంటే ఎట్లా ఉంటుంది ? నీళ్లులేకుండా బాధపడు తున్నవారిని డబ్బు ఇవ్వమని అడుగుతున్నారు. వారు డబ్బు ఇచ్చుకోలేరు. కొంత శ్రమదానం ఇవ్వ టానికి సిద్ధంగాఉన్నారు. లోగడ 1/4 వ భాగం శ్రమదానం ఇస్తే బావులు త్రవ్వి స్తామన్నారు. నాల్గవభాగం శ్రమదానం ఇస్తామని అనేక దరఖాస్తులు నేనే

పెట్టించి ఇచ్చాను. సిద్దారెడ్డిపాలెం, నళువాయి, అన్నారెడ్డిపాలెం గ్రామాలలో అనేక అర్జీలు పంపించాను. వారు శ్రమదానం ఇస్తామని చెప్పినప్పటికి, వారికి బావులు త్రవ్వించటానికి ప్రభుత్వం పూనుకోలేదు. కాబట్టి తక్షణమే నాలుగో వంతు శ్రమదానంగా తీసుకొని యీ ప్రభుత్వం పనులు చేయాలని చెబుతున్నాను.

తరువాత కోఆపరేటివ్ విధానాన్ని అభివృద్ధిపరచవలెనని ప్రభుత్వము ఉద్దేశిస్తున్నప్పుడు చేపలు పట్టేవాళ్ళు ఫిషర్‌మన్ కోఆపరేటివ్ సొసైటీలు ఏర్పాటు చేసుకుని చేపలు పట్టడము లీజుకు ఇవ్వమని కోరారు. కాని, అట్లా యివ్వకుండా పంచాయితీబోర్డులకో, లేక వేరే ఎవరో వ్యక్తులకు వేలముద్వారా యివ్వడమో జరుగుతున్నది. ప్రభుత్వము యిలాంటి విధానమును అవలంభించడము ఏమాత్రము సమంజసముగ లేదు. రెండు వందలు నెంబరు గల జి. ఓ. ప్రకారము చేపలను లీజుకు సొసైటీల ద్వారా యివ్వవలెనని ఉన్నప్పటికినీ, అలా జరగడములేదు.

మిస్టర్ స్పీకర్ :— మీకు టైము కావచ్చింది. ఇక మీ ఉపన్యాసము ముగించండి.

**శ్రీ యస్. వేమయ్య:**—ఇంకా పది నిమిషములు టైము యివ్వండి. వీలుగా వుంటే, మా పార్టీ సభ్యులకు యిచ్చే టైమును మేము **adjust** చేసుకొని పంచుకుంటాములెండి.

**డాక్టరు బి. గోపాలరెడ్డి:**- భూముల పంపిణీ మాదిరి కాలమును పంచుకుంటామని అంటున్నారా?

**శ్రీ యస్. వేమయ్య:**-భూముల పంపిణీ కొరకు భూసంస్కరణల విధానము ఎట్లా ఉన్నను, కనీసము గవర్నమెంటు పోరంబోకు భూములు పంచటానికి ప్రభుత్వము అంగీకరించడములేదు. భూసంస్కరణలు తెస్తామని ప్రభుత్వం చెపుతున్నారే గాని, వాటిని నిజంగా తెస్తారన్న నమ్మకము మాత్రము నాకు కలగడము లేదు. అది అట్లు ఉండనివ్వండి. ఆ విషయము వచ్చినప్పుడు మాట్లాడవచ్చును. విడవలూరు, బద్వేలు, మాదిరాజు, గూడూరు వాళ్ళు Fishermen Societies ఏర్పాటు చేసుకుంటాము. లీజుకు యివ్వమని అడిగారు. వారికి యివ్వకుండా, ప్రభుత్వానికి ఏదో డబ్బు వస్తుందని, వేలముద్వారా పంచాయితీబోర్డులకో, యింకా ఎవరో వ్యక్తులకో యిస్తామని అన్నారు. అలాంటప్పుడు జి. ఒ. నెంబరు 200 యొక్క ఉపయోగమేమి?

తరువాత Irrigation facilities కలుగజేస్తున్నారు. కాని అవి హరిజనులకు యివ్వవలసివచ్చినప్పుడు ఏదో restrictions పెట్టి యిస్తున్నారు. ఉదాహరణకు ఒక పర్యాయము కూర్మయ్యగారిని 1950 వ సంవత్సరములో ఒక చోటకు

[13th March, 1958

తీసుకుని వెళ్ళి స్వయముగ చూపించాను. అది మా నియోజకవర్గములో పెద పుత్తేడు గ్రామమువద్ద, Paddisonpet అని ఉన్నది. అక్కడ హరిజనులకు 1933వ సంవత్సరములో భూము లిచ్చారు. కాలువలుకూడ త్రవ్వారు. దానికి నీరుయివ్వ మంటే యివ్వక, దానికంటె వెనుక త్రవ్విన కాలవకు నీరు సకాలములో సప్లయి చేశారు. ఈ భూములను అక్కడ ఉండే నిమ్నజాతులకు, అంటే, ఎరుకల, యానాది, మాల మాదిగలకు యిచ్చారు. నీరు కొన్ని restrictions తో ఇచ్చారు. పైగా మూడు నెలల పంట మాత్రమే వేసుకోవాలని అన్నారు. పేద వాళ్ళకు భూములు యిచ్చి, సాగుచేసుకుని బ్రతకండి అని చెప్పి, restrictions పెట్టడము సమంజసముగ ఉన్నదా? అలాంటి restrictions ఏవీ లేకుండా వాళ్ళకు నీరు సకాలములో అవసరమైనంత సప్లయి చేయాలని మనవిచేస్తున్నాను. అదే విధముగ చన్నాయపాలెం అని కావలి తాలూకాలో ఉన్నది. జువ్వలదిన్నె గ్రామం. మజరా గ్రామము. అది అక్కడ 1929 వ సంవత్సరములో 149 ఎకరాలు reserve చేసి యిచ్చారు. వాటికి యింతవరకు పట్టాలు అయినా యివ్వలేదు. పట్టాలు యివ్వకపోగా, కనీసము నీటి పారుదల అయినా జరగకుండా అటకా యిస్తున్నారు. ఆ విధముగ ఎందువల్ల జరుగుతున్నదో ప్రభుత్వము విచారించవల సిందిగా కోరుతున్నాను.

ఇక పోతే ప్రభుత్వోద్యోగస్థుల విషయము ప్రభుత్వము దృష్టికి తేదలచు కున్నాను. Vacancies fill up చేసే విషయములో హరిజనులకు కొన్ని concessions ఇస్తున్నామని అంటున్నారు. కొన్ని Posts reserve చేస్తున్నామని కూడ అన్నారు. కాని యివి పాటిస్తున్నట్లు కన్పించదు. ఈ విషయమునుగురించి హరిజనులకు ఏ విధముగ అన్యాయాలు జరుగుతున్నవో మంత్రిగారిని ఒకసారి పరి శీలించమని అంటున్నాను. ప్రతి డిపార్టుమెంటులోను హరిజనులకు representation అనేదే లేకుండా పోయిన పరిస్థితులు ఉన్నవి. ఈ విషయములో నేను కొన్ని ఉదాహరణలు యిస్తున్నాను ప్రభుత్వము శ్రద్ధవహించి యీ లోపములను సరి దిద్దవలసిందిగా కోరుతున్నాను. 1929 వ సంవత్సరములో Service Commission ఏర్పాటుచేయబడినది. అది పుట్టి ఇన్ని సంవత్సరములైనప్పటికినీ ఒక్క Department లో నైనా సరైన representation ఉండేటట్లు చూడడములేదు. ప్రభుత్వము అయినా యీ విషయము గమనించడములేదు. ఇక మన హరిజన మంత్రి సంజీవయ్యగారు ఉన్నారంటే, వారు అసలే జోక్యము కలిగించుకోవడము లేదు. ఈ విధముగ అందరు అన్నివైపులా హరిజనులయందు నిర్లక్ష్యము, నిర్దయ చూపుతూ ఉంటే, యీ హరిజనుల గతి ఏమి కానున్నది? అది పరిశీలించే దిక్కు కూడ కన్పించడములేదు. హరిజనులను ముందుకు తేవాలని కాంగ్రెసు ప్రభుత్వము చెప్పడమేకాని, వారికి నిజమైన సహాయము జరగడములేదు. హరిజనులకు సరైన

13th March 1958]

representation ఉండేటట్లుగా చూడమని కేంద్ర ప్రభుత్వమునుంచి ఒక సర్క్యులర్ కూడ పంపినట్లుగా ఫిబ్రవరి ఏడవ తేదీన Indian Express లో పడింది. Selection లో గాని, promotions లో గాని హరిజనులలో efficiency తక్కువ అని, merit ఏమీ లేదని వాళ్ళను వెనుకకు తొక్కివేస్తున్నారు ఆ సర్క్యులర్ ను గురించి ప్రభుత్వము తీసుకున్న చర్య ఏమిటి? మంత్రివర్గము ఏమైనా ఆలోచించిందా? పోనీ Service Commission వారు Selection చేసేటప్పుడైనా Fill up చేసిన పోష్టుస్ reserved vacancies వున్నాకూడా మొట్టమొదట general posts అన్నీ ఇప్పుడు ఖాళీ చేయించండి. అప్పుడు merit ఉన్న హరిజనులు ఎవరో తెలుస్తుంది. Reserve Posts కొరకు రెండవసారి selection మరల ఆరంభించండి. Suitable Candidates లేరని చెప్పి, అవి ఎవరికో యివ్వకుండా, suitable Candidates దొరికినదాకా, అవి fill up చేయకుండా వుంటే, అప్పుడు ప్రభుత్వానికి మంచి స్వభావమే ఉన్నదని అనుకోవచ్చు. అలా చేయక ఇతరులను అందులో వేయడము జరుగుతున్నది. India Government లో Home Ministry పంపిన circular ను అమలులో పెట్టాలని, Harijan candidates లేకపోతే రెండు సంవత్సరములవరకు అవి అట్లాగే ఉంచి, ఆ తరువాత Common pool లోకి పోవాలని చెప్పారు. దానిని గురించి ప్రభుత్వము ఏమి చేసింది? దానిని గురించి ప్రభుత్వము ఏ విధానమును అవలంభించబోతుందో చెప్పమంటున్నాను. Reserved vacancies బీహారులో 25% Harijans కొరకు కేటాయించారు. ఒరిస్సాలో 18%, U. P. లో 19%, మధ్యప్రదేశ్ లో 50%, సౌరాష్ట్రలో cent percent ఇచ్చారు. కోటా వచ్చేంతవరకు cent percent ఉండాలని అన్నారు కాని మన ప్రభుత్వము నామమాత్రముగా 16% అని చెప్పడమేగాని, ఆచరణలో ఆవిధముగ చేయడములేదు. బీహార్ రాష్ట్రములోను, ఒరిస్సారాష్ట్రములోను ఇంకొక పద్ధతిగూడ అవలంబిస్తున్నారు. Class III and IV Categories అన్నికూడ Harijans కే cent percent ఇవ్వాలని reserved vacancies క్రింద అట్టే పెట్టారు. పూర్తి quota వచ్చేవరకు యీ vacancies fill up చేయకూడదని ఆ రెండు ప్రభుత్వాలు గట్టిగా చెబుతున్నారు. బీహార్ లో అన్ని ఖాళీలు Class IV లో హరిజనుల కివ్వమన్నారు. ఒరిస్సాలో Class III లో 50%, తక్కినవి Class IV లోను యివ్వాలని అన్నారు. U. P. లో quota పూర్తిగా reach అయ్యేవరకు ఇతరులకు ఇవ్వరు. పంజాబులో retrenchment హరిజనులకు apply చేయడము లేదు. ఆ రాష్ట్రాలలో ఆవిధముగ concessions ఇస్తూంటే, ఇక మనరాష్ట్రప్రభుత్వము ఏమి చేస్తున్నది ? మచ్చుకు రెండు ఉదహరణలు చెబుతాను. ఆంధ్రప్రదేశ్ లో నాదగ్గ లెక్కలు లేవుగాని, ఆంధ్రరాష్ట్రములో మనము ఉన్నప్పుడు నేను సేక

[13th March 1958

రించిన లెక్కల ప్రకారము ఏవిధముగ ఈ Harijans కు representation ప్రభుత్వము ఇచ్చిందో చూడండి. Secretariat Services in Superintendents 131 మంది ఉంటే ఒక్క హరిజనుడు ఉన్నాడు. Scheduled Castes - ఒక్కరు Tribes అసలేలేరు. U. D. Cs, 292 మందికి ఒక్కరు, L. D. Cs. 153 మందికి-ఒక్కరు Typists 162 మందికి ఒక్కరే.

P. As. 9 మందికి-ఒక్క Harijan గాని Girijan గాని లేరు. P.Cs. 11 మందికి - ఒక్కరుకూడ లేరు. ఇక Co-operative Department లో Sub-Registrars 169 మందికి ఒక్కరున్నారు. Temple Executive Officers 162 మందికిఇద్దరు.Panchayat Executive Officers 281 మందికి, 16 మంది ఉన్నారు. D. S. Ps గాని Dy. Supdts., Circle Inspectors వగైరాలు 16, 45, 139; ఈ విధముగావుంటే ఇందులో ముగ్గురు మాత్రమే హరిజనులు ఉన్నారు. కాబట్టి హరిజనులకు యిచ్చిన representation ఏవిధముగ ఉన్నదో చూడండి. ఇకపోతే Supervisors, Engineers కృషిచూస్తే 1445 మంది వుంటే అందులో 26 మందే హరిజనులు ఉన్నారు. Assistant Engineers 430 మందికి ఆరుగురు Executive Engineers 114 మందికి ఇద్దరు హరిజనులు ఉన్నారు. Supervisors 250 మందికి 11 మంది ఉన్నారు. ఇవిగాక Local Boards Department లో హరిజనులు ఎంతవరకు నిర్లక్ష్యము చేయబడుతున్నారో చూడండి. పైనుంచి circular వచ్చినను, ప్రభుత్వము ఏలాంటి శ్రద్ధతీసుకోలేదు. దానిని అమలు జరుపలేదు. ఇకపోతే Teachers Category తీసుకుంటే 8952 మందికి హరిజనులుగాని, గిరిజనులుగాని, 155 మంది మాత్రమే ఉన్నారు. దీనినిబట్టి representation ఎంత తక్కువ percentage లో ఉన్నారో చూడండి. ఇక ముందు అయినా Harijans కు సరైన representation ఉండటానికి Service Commission లో Ex-officio Members గా మంత్రిగారు, Social Welfare Director ను చేర్చితే ముందు ముందు అయినా యీలోపాలను సరిచేయవచ్చు.

మరొక విషయము ఉన్నది. పేదప్రజలకు పని కల్పించాలని Constitution చెబుతున్నది. అందులో Harijans విషయము ముఖ్యముగ చెప్పబడియున్నది. అందువల్ల Constitution లో ఉన్న Directive Principles ను ఖచ్చితముగ అమలు జరపటానికైనా యీ ప్రభుత్వము పూనుకోవడములేదు. ఇక ముందైనా అలాంటి అవకతవకలు జరగకుండా చూస్తారని ఆశిస్తున్నాను. చేస్తారో లేదో అనే అనుమానము నాకు గట్టిగా ఉంటున్నది.

Directory of Information and Broad Casting అని ఒక పుస్తకము కేంద్రప్రభుత్వం ప్రకటించింది - అది 1957 లో జరిగింది. రాష్ట్ర

13th March 1958]

ప్రభుత్వము, కేంద్రప్రభుత్వానికి ఏమనిచెప్పిందోగాని అక్కడ Security of Land Tenure ఇచ్చినట్లుగా ఒక రిపోర్టు తయారు చేయబడింది. కాని ఏ విధముగ యీహరిజనులకు, గిరిజనులకు Security of Land Tenure ఇచ్చారో చెప్పవల సిందిగా మంత్రిగారిని అడుగుతున్నాను. దానిని గురించి ఆ రిపోర్టులో ఏమని పొందుపరచబడిందో నాకు తెలియలేదు. దానిని గురించి మంత్రిగారు సమా ధానము చెప్పవలసిందిగా కోరుతూ ఇంతటితో సెలవు తీసుకుంటున్నాను.

శ్రీ ఎజ్.కె.లింగం (నంగికొట్కూరు-రిజర్వుడు):— అధ్యక్షా! హరిజనులకు సంబంధించిన పద్దుపై మాట్లాడుటకు నాకు అవకాశం ఇచ్చినందుకు ముందుగా మీకు నా మనఃపూర్వక నమస్కారముల నర్పిస్తున్నాను. నేను ఇప్పటికి సుమారు 8 సంవత్సరములనుంచి శాసనసభ్యునిగా ఉంటున్నాను. ఈనాడు పల్లెలలో వుండే హరిజనులు, గిరిజనులు—ఇతర వెనుకబడిన జాతులవారు అనుభవిస్తున్న ఇక్కట్లను గురించి చెప్పుటకు నేను దుఃఖించుచున్నాను. సుమారు 7, 8 సంవత్సరములనుంచి హరిజన వెల్ ఫేర్ డిపార్టుమెంటు పనిచేస్తున్నది. కాని ఆ డిపార్టుమెంటులో ఊడిచే ఉద్యోగిగా అయినా హరిజనుడు లేడని ప్రభుత్వ దృష్టికి తెస్తున్నాను. కనీసం బంట్రోతు ఉద్యోగమైనా యీయనివారు ఇక పెద్దఉద్యోగాలు యిస్తారా?

శ్రీ డి. సంజీవయ్య:—డిప్యూటీ డైరెక్టరుగారి Personal Assistant హరి జన కుటుంబములోనివారే. కర్నూలుజిల్లా Welfare Officer గారు హరిజన క్రిస్టియన్.

శ్రీ ఎస్. కె. లింగం:-ఇప్పుడు మంత్రిగారుకూడా హరిజనులేనన్న సంగతి అందరికీ తెలుసు. వారికి సమర్థించవలసిన బాధ్యత ఉన్నది కనుక యిట్లా సమర్థి స్తున్నారు. కాని వారుకూడా మనస్సులో బాధపడుతూనే ఉంటారు. నంది కొట్కూరు తాలూకాలోని రేడిగూడూరులో హరిజనుల ఇండ్ల స్థలాలకొరకు 7 సంవత్సరములక్రితం కొన్ని వేల రూపాయలు కేటాయించారు. కాని, ఆ డబ్బు ఏ Treasury లోనైనా కట్టినారో, లేక ఏ వ్యక్తులకైనా ఇచ్చినారో కాని, ఇంతవరకు పట్టాలు ఇవ్వలేదు. నేను అప్పటి నుంచీ Collector's Office, తహాశీల్దారుగారి ఆఫీసులు, డిప్యూటీ తహాశీల్దారిగారి ఆఫీసు, Welfare Offices-అన్నీ తిరుగుతూనే ఉన్నాను. ఆ కాగితాలుకూడా మటుమాయమైపోయినట్లు నాకు తోచింది. కాబట్టి మంత్రిగారు ఇప్పుడైనా, తగిన చర్యలు తీసుకోవాలని ప్రార్థి స్తున్నాను.

నేను అనేక పల్లెటూళ్ళు పర్యటించాను. సిద్దపల్లి అనే పల్లెటూరు ఉన్నది. అక్కడి ప్రజలు మంచినీరు దొరకక మురికినీటిని త్రాగుతున్నారు. అయితే 7సం॥ల నుంచీ ఉన్నటువంటి ఈ డిపార్టుమెంటువారు ఏమి చేస్తున్నారు? ఏయే ప్రాంతా

లలో ఎవరు ఎటువంటి బాధలుపడుతున్నారు, వారి అవసరాలేమిటి, అనే విష యాలపై జాబితా తయారుచేశారా? రెండవ పంచవర్ష ప్రణాళికకూడా పూర్తి కావస్తున్నది. పల్లెలలో ఉండే మాల, మాదిగలు, వెనుకబడినవారు, హరిజనులు, గిరిజనులు-మున్నగువారికి ఎటువంటి వసతు లున్నాయో, లేక ఇంకా ఏమి వస తులు కావాలో ఒక జాబితా తయారుచేయించాలి. రెండవ పంచవర్ష ప్రణాళికా కాలం పూర్తి కాకముందే, అటువంటి జాబితాను తయారు చేయించవలసినదని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

హరిజనులు, హరిజన క్రిష్టియనులు అని రెండు తెగలుగా ఉన్నారు. మాన వులలో అంటుకోతగినవారు, అంటుకోదగనివారు అనే రెండు తెగలుగా చేశారు. ఈనాడు నా చెల్లెలు క్రిస్టియన్‌గా ఉన్నది. ఆమె కుమారులు స్కూలు జీతాలు కడుతున్నారు. నా కుమారులు జీతాలు కట్టడం లేదు. అందరమూకూడా మాల పల్లెలో మగ్గి చచ్చేటంత బాధలుపడుతున్నాము, వారందరూ కుక్కలకంటే, పందులకంటే నీచంగా చూడబడుతున్నారు. అటువంటప్పుడు హరిజనులకూ, హరి జన క్రైస్తవులకూ తేడా ఏమి ఉన్నది? అసెంబ్లీకి కేటాయించిన సీట్లనుకూడా తగ్గించడానికే ఇట్లా చేశారనుకుంటాను. నిజంగా హరిజనులకు, హరిజన క్రైస్థవు లకూ ఏమీ తేడా లేదని నేను చెబుతున్నాను. హరిజనులకు డబ్బు ఇచ్చినవిధం గానే, వెనుకబడ్డవారనే పేరుతో కొండజాతులకు, కొండ కాపులకూ అనేక లక్షల రూపాయలు ఖర్చుచేస్తున్నారు. అంటరానివారికి ఏమి ఇస్తున్నారు? క్రైస్తవులు అంటరానివారు. హరిజన క్రైస్థవులు, క్రైస్థవులు, మాలవారు, మాదిగవారు అంతా పల్లెటూళ్ళలో ఉంటున్నారు హరిజనశాఖామాత్యులు యీ విషయమై బాగా ఆలోచించాలని కోరుతున్నాను. మా జిల్లాకు Welfare Officer ను నియ మించారు. మా జిల్లా వెళ్ళాలంటే రైలులో 3 రోజులు ప్రయాణం చేయాలి. ఆ ఆఫీసరు వస్తే వారి ప్రయాణ బడలిక తీర్చుకోవడానికి రెండు రోజులు పడుతుంది. ఇక వారు ఏమి పని చేస్తారో నాకు అర్థంకాకుండా ఉన్నది. వారికి ఒక jeep ను supply చేయండి, బాగా పనిచేస్తారు అని నేను ఎంతోకాలంనుంచి ప్రభుత్వానికి చెబుతున్నాను. కాని అట్లా ఇవ్వడంలేదు. చాలా పెద్దదైన మన రాష్ట్రంలో Welfare Officers కు jeeps యివ్వడంలేదు. కాబట్టి వారు ఏమీ పని చేయలేక పోతున్నారు. వారికి కావలసిన staff యిచ్చి, పరికరాలిచ్చి ప్రతి ఊరూ పర్య టించి ఒక జాబితా తయారుచేసే ఏర్పాటు చేయించాలని నేను కోరుతున్నాను.

నేను కాంగ్రెసు సభ్యుడను. కాబట్టి యీ విషయమై మాట్లాడవలసిన బాధ్యత ఉన్నది. పల్లెటూళ్ళలో పంచాయితీబోర్డులున్నాయి. వారు బ్రహ్మాం డంగా విద్యుద్దీపాలు వెలిగించుకుంటున్నారు. అట్టి అవకాశం కలుగజేసినందుకు ప్రభుత్వాన్ని అభినందిస్తున్నాను. మాల, మాదిగ, ఎరుకల పల్లెలలోకూడా lights

కావాలంటే గుంజలు (Poles) లేవు అంటారు. "లేకపోవడం ఏమిటి" అని అడిగితే ప్రభుత్వానికి ఏమి ఆదాయం వస్తుంది? అని అడుగుతారు, అయితే, మరి పంచవర్ష ప్రణాళికలోని సిద్ధాంతం ఏమిటి? వెనుకబడిన ప్రాంతాలను, ప్రజలను ఉద్ధరించాలని పేపర్లలో చూస్తున్నాము. హరిజనోద్ధరణ, వెనుకబడిన జాతుల ఉద్ధరణ, విముక్త జాతుల ఉద్ధరణ అని అంటూ ఉంటారు. పంచాయితీబోర్డులకు electric lights మంజూరు చేసినప్పుడు హరిజన, ఎరుక, ఏనాది, మాల-మొదలైన పల్లె లన్నింటికీకూడా మంజూరుచేయించాలి. అంతేకాని ఈ పల్లెలకు వేటికీ యివ్వకుండా పంచాయితీలకు మాత్రమే మంజూరు చేయకూడదని చెబుతున్నాను. మా జాతినంతా ఉద్ధరించుటకు ఒక హరిజన వెల్ ఫేర్ డైరెక్టరును-(ఆయనను భగవంతుడనినా, ప్రభుత్వం అనినా అనుకోండి)-నియమించారు. Selection Boardలో మా జాతికి చెందిన ఒకరిని వేస్తే మా తరఫున వారు మాట్లాడడానికి అవకాశం ఉంటుంది. మా తరఫున అనే పేరుతో పనిచేస్తూ కొంత డబ్బు తీసుకొంటున్నారు, కనుక ఇక వేరే మాలవారు, మాదిగవారు, ఎరుకలవారు, ఏనాదివారు_ఎవ్వరూ లేకపోయినా వారు మా ఉద్ధరణగురించి మాట్లాడేందుకు అవకాశం ఉంటుందా ?

హరిజనులకు, హరిజనక్రైస్తవులకూ labour contracts ఏర్పాటుచేశారు. 10 వేల రూపాయలకు తక్కువ ఉండే సొసైటీలకు ఇవ్వమన్నారు. కాని ఏ ఆఫీసరు దగ్గరకు పోయినా అట్లా జరగడంలేదు. కలెక్టరుగారు ప్రభుత్వానికి ఎన్నో సారులు వ్రాశారు. కాని, Forest Department కు వెడితే వారు ఇవ్వరు. P. W. D. కి పోతే వారూ ఇవ్వరు. చిన్నపనులు మాత్రమే ఇస్తున్నారు. రూ. 10 వేలకు తగ్గితే ఇవ్వవలసి వస్తుందని రూ. 11 వేలు చేసేపని అంటారు. రూ. 10 వేలు చేయమంటే వినరు. ఈ విషయాన్ని ప్రభుత్వం గమనించాలి. ఈ సంవత్సరం lumpsum grant తీసేశారు. అందువల్ల చాలా కష్టాలు కలుగుతున్నాయి. కాబట్టి మంత్రిగారు ఆలోచించి వెంటనే lumpsum grant ఇవ్వడానికి ప్రయత్నం చేయాలి. సరైనకాలంలో Scholarships రాకపోవడంవల్ల కాలేజీలలో చేరినవారు చదువు మానివేయవలసివస్తోంది.

శ్రీ డి. సంజీవయ్య :— హరిజనులు ఎవ్వరూ అట్లా మానివేయుట లేదు. Back-ward Classes వారెవరైనా ఉన్నారేమో !

శ్రీ యన్. కె. లింగం :— మంత్రిగారు సరైన విధానాలును అవలంభించాలని మనవి చేస్తున్నాను. ఈ అవకాశం యిచ్చిన అధ్యక్షుల వారికి అభివందనలు అర్పిస్తూ ముగిస్తున్నాను.

శ్రీమతి పి. వాణి రమణారావు (భద్రాచలం - రిజర్వుడు) :— అధ్యక్షా ! మంత్రిగారు ప్రవేశపెట్టిన డిమాండును బలపరుస్తూ ప్రభుత్వ దృష్టికి కొన్ని విష

యాలు తీసుకురాదలచాను. గత సంవత్సరము కన్న ఈ సంవత్సరం గిరిజన సంక్షేమానికి 77 వేలు తగ్గించి ఈ ప్రజా ప్రభుత్వంనకు మేలు చేసినందున మంత్రిగారిని అభినందిస్తున్నాను. ఈ సంవత్సరం Director of Tribal Welfare సిబ్బందికి కేటాయించిన 29 వేలను కూడ తగ్గించాలని మనవి చేయుచున్నాను. Tribal Welfare Director సిబ్బంది కోసం ఖర్చుపెట్టే ఈ డబ్బు నిజంగా గిరిజనుల అభివృద్ధికొరకు ఖర్చుచేసిన చాలా ఉపయోగంగా ఉంటుంది. ఆ డిపార్టుమెంటువల్ల గిరిజనులకు ఎలాంటి ప్రయోజనం కలుగుటలేదు.

భద్రాచలం ఏజెన్సి ప్రాంతం చాలా వెనుకబడి ఉన్నది. ఈ ప్రాంతమును అభివృద్ధిలోకి తీసుకువచ్చుటకు రహదార్లు ముఖ్యావసరం. మంచి రహదారీ సౌకర్యములు ఏర్పరచిన గిరిజన ప్రాంతం దాని అంతట అదే అభివృద్ధిలోకి వస్తుందని మనవి చేయుచున్నాను. ఏజెన్సి ప్రాంతంలో వర్షాకాలమందు కొండ వాగులవల్ల రాకపోకలు స్తంభించిపోతాయి. ఈ విషయంలో ప్రభుత్వం చాలా అలక్ష్యంగా ఉన్నది. ఏజెన్సి ప్రజానీకమునకు నాగార్జునసాగర్ లాంటి ప్రాజెక్టులు గాని, కృష్ణా బారేజిలాంటివి గాని అవసరంలేదు. రాకపోకల సౌకర్యార్థం చిన్న చిన్న కొండవాగులపై వంతెనలు కావాలి. మాకు తారురోడ్లు గాని, సిమెంటు రోడ్లు గాని అవసరం లేదు. మట్టి రోడ్లు గాని, కంకర రోడ్లుగాని చాలా అవసరం. ఈ సంవత్సరం వర్షాభావంచే గిరిజన ప్రజల ముఖ్యపంటలగు జొన్న, కొర్ర చాలా దెబ్బతిన్నవి. తినుటకు తిండిగాని, కట్టుటకు బట్టగాని, త్రాగుటకు నీరుగాని, లేని ఈ గిరిజన ప్రజలకు సౌకర్యం కలుగచేయవలసిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నదని మనవి చేయుచున్నాను. అక్కడ మైలాక్ లాంటి షాహుకార్లు తిండిలేక అవస్థలు అనుభవించుచున్న ఈగిరిజన ప్రజలకు ఇచ్చిన అప్పులను పీడించి వసూలు చేసుకుంటున్నారు. అటువంటి షాహుకార్లను అరికట్టవలసి ఉన్నదని ప్రభుత్వానికి మనవి చేయుచున్నాను. ప్రభుత్వం ఎల్లపుడు అభివృద్ధిపొందిన ప్రాంతాలనే ఇంకా అభివృద్ధిలోకి తెస్తున్నది. ఎప్పుడు ఈ వెనుకబడ్డ ప్రాంతాలను అభివృద్ధి చేస్తారు? ఎప్పుడు ఈప్రాంతాలను అభివృద్ధిగాంచిన ప్రాంతాలతో సమానం చేస్తారని నేను ప్రభుత్వమును అడుగుచున్నాను.

భద్రాచలం ఏజెన్సిలో నాలుగు తాలూకాలు ఉన్నప్పటికి ఒక్క ఏజెన్సి బ్లాకు కూడా లేదు. అభివృద్ధి చెందిన ప్రాంతాలలో ఎక్కడ చూచినా రెండు, మూడు బ్లాకులున్నవి. ఏజెన్సిలో ఇట్టి బ్లాకులే కాకుండ, Multi - purpose బ్లాకులు కూడ అవసరమని మనవి చేయుచున్నాను. వాటిని ముఖ్యంగా ఏజెన్సిలో బ్లాకులు లేని చోట్ల పెట్టాలని కోరుచున్నాను.

భద్రాచలం ఏజెన్సీలో స్కూళ్ళు చాలా వరకు మిషినరీలచేత నడుపబడుచున్నవి. వాటివల్ల గిరిజన ప్రజలు అభివృద్ధిలోకి వచ్చుటకు వీలు లేక పోగా బాధి

మతం మార్పించుటకు ప్రచారం సాగిస్తున్నారు. కాబట్టి ఈ స్కూల్సు అన్నింటిని ప్రభుత్వం తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉన్నది. అక్కడ విద్యార్థులకు హాస్టల్సు ఉన్నవి. కాని వారు ఉండుటకు, వండుటకు సౌకర్యములు లేక నానా యాతనలు అనుభవించుచున్నారు. కిచెన్‌లోను, స్కూల్ వరండాలోను పడుకుంటున్నారు. కాబట్టి ప్రభుత్వం వెంటనే అక్కడ కొన్ని బిల్డింగులను కట్టించాలి.

ఏజెన్సి ప్రాంతంలో వైద్య సౌకర్యములు అసలే లేవు. నాలుగు తాలూకాలలోని రెండు, మూడు హాస్పిటల్సులో డాక్టర్సు లేరు. లేడీ డాక్టరు ఒక్క భద్రాచలం తాలూకాలోనే ఉన్నది మిగతా తాలూకాలలో కూడా ఒక్కొక్క లేడీ డాక్టరును వేయాలి. హరిజనుల అభివృద్ధి కొరకు మొబైల్ హాస్పిటల్సు పెట్టడం చాలా అవసరమని ప్రభుత్వమునకు మనవి చేయుచున్నాను. యల్లవరం తాలూకాలో వట్టిగెడ్డ రిజర్వాయర్ కట్టించడం అవసరమని ప్రభుత్వ దృష్టికి తీసుకు వచ్చాను. దానిని త్వరలో కట్టించవలసిందని మనవి చేయుచు నాకీ అవకాశమిచ్చినందుకు మీకు ధన్యవాదములు తెల్పుచున్నాను.

శ్రీ ఎ. ఎరుకు నాయుడు (సాలురు - జనరల్) : అధ్యక్షా ! గౌరవనీయులైన సోషల్ వెల్‌ఫేర్ మంత్రిగారు ఈ డిమాండును ప్రతిపాదిస్తు ప్రభుత్వం చేస్తున్న పనులను వారి కవితా చాతుర్యంచేత చాలా గొప్పగా వర్ణించినారు. కాని గ్రామాలలో చూచిన ఆ పనులు ఎలా అమలు జరుగుచున్నది బోధపడగలదు. హరిజనులకు ఉచిత విద్యావకాశమును కల్గించినామని చెప్పుచున్నారు. కాని వారి దగ్గర స్పెషలు ఫీజు వసూలు చేస్తున్నారు. ఈ స్పెషలు ఫీజు చెల్లించ లేక చాలా మంది విద్యార్థులు చదువును కూడ వదలివేసిన సంఘటనలు మంత్రిగారికి తెలుసును. వారికి దానినుండి గూడ మినహాయింపు ఇవ్వాలి.

ఉచిత భోజన సదుపాయం కొరకు హస్టల్సు పెట్టినామని చెప్పుచున్నారు. సబ్సిడైజ్ హస్టల్సులో ఒక్కొక్కరికి 15 రూ॥లు మాత్రమే ఇచ్చుచున్నందువల్ల విద్యార్థులకు సరియైన భోజనం లభించడం లేదు. సాలూరులో మూడు సంవత్సరముల క్రిందట స్థాపించబడిన హాస్టలు ఇప్పుడు మూసివేసినారు. మున్సిపాలిటి హాస్టలు బిల్డింగును ఉచితంగా ఇచ్చినంతవరకు హాస్టలును నడిపి బిల్డింగు వారు తీసికొనగానే హస్టలును మూసివేయడం జరిగింది అది తాలూకా హెడ్‌క్వార్టర్సు కాబట్టి ప్రభుత్వమే హస్టలును నడిపి హరిజన విద్యార్థులకు సదుపాయం కలుగ చేయాలని కోరుచున్నాను.

హరిజనులకు ఇండ్ల స్థలం విషయంలో ధనాభావం కారణమని చెప్పుచున్నారు. కొంత వరకు ఉండవచ్చును. గాని అసలు ప్రభుత్వ Land Acquisition Act లో ఉన్న లోపముల వల్ల హరిజనులకు ఇండ్ల స్థలాలు లభించడం

లేదని పదేపదే సూచించినాము. బొబ్బిలి తాలూకా దత్తిరాజేరు గ్రామములో హరిజనులు పదిసంవత్సరముల క్రిందట ఏడు వందల రూపాయలను ప్రభుత్వమునకు జమ కట్టినారు. కాని నేటి వరకు కూడ వారికి సైట్సు లభించలేదు. అందువల్ల Land Acquisition Act లోని లోపములను సవరించాలి.

ప్రభుత్వం ఏజెన్సి రైతుకు చేస్తున్న అనేక సదుపాయముల గురించి మంత్రిగారు చెప్పినారు. వారు పండించే పంట మార్కెటుకు వచ్చుటకు మార్గాలు లేనందున అక్కడనే చాలా చౌక ధరలకు వ్యాపారస్తులకు అమ్ముకొనవలసి వస్తున్నది. సాలూరు తాలూకా సగము area లో ఏజెన్సి ప్రాంతంగా ఉన్నా Plains క్రింద ఏ కారణంచేతనో వ్రాయడం జరిగింది. అందువల్ల ప్రభుత్వం సరిగా చూచి reclassification చేయవలసి ఉన్నదని మనవి చేయుచున్నాను.

అందులో గిరిజనుల కొరకు హస్పటల్ ను ఏర్పాటు చేయాలనే ప్రపొజల్ 3 సంవత్సరముల క్రిందటేచేసి ప్రతి సంవత్సరము బడ్జెటులో Allottment జరుగుతున్నప్పటికి హస్పటల్ బిల్డింగ్ నిర్మించడం కాని, దానిని open చేయటం కాని ఇంతవరకు జరుగలేదు. ప్రభుత్వ దృష్టికి అనేకసార్లు తీసుకువచ్చాము. హరిజనుల, గిరిజనుల అభివృద్ధికి అవసర చర్యలన్నీ ప్రభుత్వం తీసుకోవాలని మంత్రిగారికి మనవి చేస్తూ ఇంతటితో సెలవు తీసుకొంటున్నాను.

శ్రీ జి. లచ్చన్న (సోంపేట):—అధ్యక్షా ! నాకు ఇచ్చిన కాలం స్వల్పముగా వుంది కాబట్టి తక్కువ విషయాలపైననే కొన్ని సూచనలను మీ ద్వారా మంత్రిగారికి చేయదలచుకొన్నాను. హాస్టల్స్ నిర్వహణ గురించి మంత్రిగారు చెప్పారు. ప్రతి కాలేజికి సంబంధించిన హరిజనులకు, Back-ward Classes కు, హిల్ ట్రైబ్స్‌కు కనీసపు స్థానాలు రిజర్వుచేసి ప్రభుత్వ పద్ధతులలో హాస్టల్స్‌ను fixచేయాలని నేను మనవిచేస్తున్నాను. చిన్న Private Social Service చేస్తున్నవారికి హాస్టల్స్ అవకాశమును కల్పించాలి. ప్రైవేటు హాస్టల్స్ మేనేజ్ చేస్తున్నవారికి లమ్‌సమ్ గ్రాంటు ఇస్తామని వారు చెప్పారు. ఏ బేసిస్‌మీద ఇస్తారో వారు చెప్పలేదు. ఏ బేసిస్‌లో ఇచ్చినప్పటికి మేనేజరుకు తప్పనిసరిగా ఆనరోరియం అనేది fix చేసి, వారు గౌరవంగా జీవనం చేస్తూ, పేద విద్యార్థులకు సేవచేసేదానికి ఈ లమ్‌సమ్ గ్రాంటులు ఇవ్వటం మంచిదని నేను తెల్పుతున్నాను.

బోగస్ సర్టిఫికేట్లగురించికూడా మంత్రిగారు మాట్లాడారు. వాటిని నివారించటానికి ప్రభుత్వము ఏమి చర్యలు తీసికొన్నదో వారు తెల్పలేదు. స్కాలర్‌షిప్స్ గురించి కేంద్రంనుండిగాని, రాష్ట్రంనుండిగాని వచ్చిన అన్ని సర్టిఫికేట్లను verify చేయాలని కోరుతున్నాను. Verify చేసిన తరువాత అది బోగస్ అని తెలిసినపుడు ఆ సర్టిఫికెట్‌మీద సంతకం చేసిన గ్రామోద్యోగిని, తహసిల్దారును,

దరఖాస్తుదారుని ముగ్గురిని ప్రాసిక్యూట్ చేయాలి. అప్పుడే ఈ పద్ధతిని నివారించ టానికి అవకాశ ముంటుంది. దానిని పరిశీలించాలని మంత్రిగారిని కోరుతున్నాను.

ఇండ్ల స్థలాలగురించికూడా మంత్రిగారు ప్రస్తావించారు. ఇండ్ల అభివృద్ధికి low Income group houses అని, మరి యింకో తరగతిగానే బస్తీలలోనే అన్ని ప్రయత్నములు చేస్తున్నారు కాని, అదే సూత్రాన్ని పల్లెటూర్లకు ఎందుకు వర్తింప చేయరో, ఎందుకు శ్రద్ధ తీసుకోరో నాకు తెలియటంలేదు. డబ్బు లేదనే కించను వదలి, రాష్ట్ర ప్రభుత్వం శ్రద్ధను తీసుకొని, స్కీమును వేసి, 4 లక్షలను గ్రాంటు చేస్తే కేంద్రంనుండి 10 లక్షలు అప్పు తీసుకొని కార్యక్రమమును కొనసాగించ టానికి అవకాశములు వున్నాయని నా విశ్వాసము. హరిజనులకు, వెనుకబడిన తరగతులవారికి ఇండ్ల సౌకర్యము కలుగజేసే నిమిత్తం allot చేసిన లక్ష రూపా యలను ఖర్చుచేయకుండా వుండటం, మాటలుచెప్పి పనులు చేయకపోవడము ప్రభుత్వ విధానముగా వుంది. ఏదో ప్రజలను శాంతపర్చటానికి మొసలి కన్నీరు విడిచినందువల్ల ప్రయోజనం లేదని మనవి చేస్తున్నాను.

విముక్త జాతుల నోటిఫికేషన్‌లో షెడ్యూల్డు ట్రైబ్స్‌ను చేర్పించినప్పటికీ, రాష్ట్ర ప్రభుత్వము రికమెండ్ చేసినా యింకా షెడ్యూల్డు ట్రైబ్స్‌గా చేయబడ నివికూడా వున్నాయి. వాల్మీకి మొదలైన జాతులవారందరిని చేర్పించటానికి ప్రయత్నించాలి. ఈ బడ్జెటు లెక్కలను చూస్తే ఒకటి చాలా శోచనీయముగా కన్పిస్తున్నది. ద్వితీయ ప్రణాళికలో క్రమాభివృద్ధి చూపించటానికిబదులు 1957-58 లెక్కలకంటె 1958–59 లెక్కలు దిగజారిపోయినవి. విముక్త జాతులకు గత సంవత్సరం రు. 9,28,000 ఖర్చుపెట్టారు. ఆ మొత్తమే చాలని పరిస్థితి వుంటె ఈ సంవత్సరం రు. 7,10,000 లకు తగ్గించారు. షెడ్యూల్డు ట్రైబ్స్‌ను గత సంవ త్సరం రు. 82,79,000 ఖర్చుపెడితే ఈ సంవత్సరం రు. 82,20,000 చేశారు. అదే విధంగా బాక్‌వర్డ్ క్లాసెస్‌కు allot చేసిన 17 లక్షలు 11 లక్షలకు దిగజారిపోయి నది. కాని సోషల్ వెల్‌ఫేర్ మంత్రిగారి ఉపన్యాసము వింటున్నంతసేపు వాస్తవ పరిస్థితిని మరచిపోయి 'బాగుపడుతున్నారేమో' అనిపించింది. ఈ allotment ను తగ్గించటానికి మంత్రిగారి మనసు ఎలా ఒప్పిందో నాకు అర్థంకావటంలేదు. ఆ బాధ్యత ఒక్క మంత్రిగారిదే కాదని నాకు తెలుసు. ఆ బాధను నేను అనుభ వించాను.

సర్వీసెస్ గురించి వేమయ్యగారు చాలా లెక్కలు చెప్పారు. కాని ఎక్కువ అవకాశం లేదు కనుక రిజర్వేషన్‌గురించి నేను ఒకవిషయం చెప్పదలచుకొన్నాను. నామకః రిజర్వేషన్ అని చెప్పినా అలావుండటంలేదు. 5సీట్లు షెడ్యూల్డ్ కాస్టువారికి 7 సీట్లు బాక్‌వర్డ్ క్లాసెస్‌కు రిజర్వుచేస్తే మొత్తం 700 ధరఖాస్తులువస్తే వారిల్లో

ఒకరిద్దరు మాత్రమే సెలక్టు కావటం జరుగుతోంది. కమిటి ఇంటర్వ్యూలలో కాని, డిపార్టుమెంటు ఇంటర్వ్యూలలో కాని సర్వీస్ కమిషన్‌వారి ఇంటర్వ్యూలో కాని not suitable అనే జడ్జిమెంటు ఇస్తారు కాని, కారణాలను మాత్రం చెప్పరు. ఏ subject లో ఎన్ని marks వచ్చాయో చెప్పరు. 70 మంది interview కు వస్తే 5 గురుకూడా select కావటం కష్టంగా వుంటున్నది. Interview systemను మార్చటానికి ప్రభుత్వము కొంత చర్చ జరిపింది. కొన్ని rules ను తయారుచేసింది. కాని వాటిని ఎందుకు అమలు జరపలేదనే నేను ప్రశ్నిస్తున్నాను.

షెడ్యూల్డుకాస్టు, షెడ్యూల్డు ట్రైబ్స్‌వారు చదువుకొంటున్నా S.S.L.C. వరకు రావటమే బ్రహ్మాండముగా వుంటున్నది. వారు స్కూలు టీచర్ ఉద్యోగానికి పోదామనుకొన్నా S. S. L. C. Pass అయితే గాని పోవటానికి వీలు లేదనే సూత్రం ఈ నాడు ఎడ్యుకేషనల్ డిపార్టుమెంటులో వుంది. అది తప్పని నేను చెబుతున్నాను. Standard లేని వారిని masters గా పంపిస్తే చదువు చెడి పోతుందనే ఆర్గ్యుమెంటు తీసుకురావచ్చును. కాని స్టాండర్డును పెంచటానికి వారికా వీలును కల్పించాలి. సాంఘికంగా, ఆర్థికంగా వైజ్ఞానికంగా తరతరాలనుండి అధోగతిలో వున్నవారికి ఈ 'స్టాండర్డు' అనే కొలతనుపెట్టి ఉద్యోగార్హతలను నిర్ణయించటం మోసగించటమే అవుతుంది. సర్వీస్ కమిషన్ రూల్స్ విషయములోను, interview rules విషయంలోను, ప్రమోషన్ విషయములలో న్యాయం జరిగే విధముగా మంత్రిగారు శ్రద్ధగా పరిశీలించవలసిన అవసరం వుందని మనవి చేస్తూ సెలవు తీసుకొంటున్నాను.

**శ్రీ జి రామలింగం** (జనగాం-రిజర్వుడు) :- హరిజనులకు, బాక్‌వర్డు క్లాసులకు, షెడ్యూల్డు ట్రైబ్స్‌కు సంబంధించి ఈ డిమాండును మంత్రిగారు ప్రవేశపెట్టారు, వారికి 2,39,16,000 రూ. లను కేటాయించారు. ఆ మొత్తము ఎక్కువని కొందరు, హరిజనుల అభివృద్ధికొరకు ఎంత కేటాయించినా, అది తక్కువే అని కొందరు మాట్లాడారు. హరిజనుల అభివృద్ధికి పనిచేస్తున్నామని చెబుతు 33% వున్న వారికి 2 కోట్లను కేటాయించటం ఏమంత ఉపయోగపడుతుందో మనం వూహించుకోవచ్చును. ముందుగా వారిలో విద్యాభివృద్ధి కల్గించాలి. వారిని విద్యలో ముందుకు తీసుకుపోవాలని ప్రభుత్వం నిర్ణయించుకొన్నది అది ఉత్తమమైన పని.

విద్యావిషయంలో తెలంగాణా చాలా వెనుకపడియున్నది. మొదటి తరగతినుంచి, నాల్గవ తరగతి వరకు క్లాసుకు రూపాయ చొప్పున, నాల్గవ తరగతికి వెళ్లేటప్పటికి నాలుగు రూపాయలు కట్టవలసి వస్తోంది. ఈ స్కూలు జీతం కట్టలేక హరిజన పిల్లవాళ్లని ఆరు సంవత్సరాలు వచ్చేసరికి పశువులు కాపరిగా పెడు

తున్నారు. ఈవిధముగా ధనాభావమువల్ల, హారిజనుల పిల్లలకు విద్యలేకుండా పోతోంది. కాబట్టి యిదివరకు వలె డబ్బు యిచ్చేటటువంటి అమలులో ఉంచాలని మనవి చేస్తున్నాను. గ్రామాలలో ఉన్నవారికి తప్పకుండా యీ సౌకర్యం కల్గించాలని కోరుతున్నాను. Primary క్లాసులలో ప్రతివిద్యార్థికి 5/- రూ. ల చొప్పున స్కాలర్ షిప్ యివ్వాలని మనవి చేస్తున్నాను. హాస్టలులో 14 సంవత్సరములు దాటిన వారికి ఆంధ్ర రూల్సు ప్రకారం ప్రవేశార్హత ఉండుటలేదు. హరిజన బాలురు పదియేండ్లకుగాని స్కూలులో ప్రవేశించనే ప్రవేశించరు. 14 యేండ్లు వచ్చే సరికి వారు, నాలుగు క్లాసులకంటే యెక్కువ చదువలేరు. దీనివల్ల యింకా యెక్కువ చదువులు చదువుకోవాలంటే వీలుపడుటలేదు. కాబట్టి పూర్వపు తెలంగాణాలోని రూల్సునే హాస్టల్సు విషయములో apply చేయవలసినదిగా కోరుతున్నాను. ఈ విషయంలో age exemption యివ్వవలసినదిగా కోరుతున్నాను. Backward Class పిల్లలకు, ఏడవ తరగతి చదివే వారికి freeship యివ్వమని కోరుతున్నాను. తరువాత ల్యాండు ఎక్విజిషన్ విషయంలో చాలా బాధాకరంగా ఉంటోంది. ఎన్ని అప్లికేషన్స్ పెట్టుకొన్నప్పటికి, ఎంత కాలం వరకు వేచి ఉన్నప్పటికి, వాటిపై చర్యతీసుకొనే వారు కనపడుటలేదు. తహసీలు కచ్చేరినుంచి, కలెక్టరుకు, అక్కడనుంచి రెవిన్యూబోర్డుకు పోవుటకు సంవత్సరాలు పడుతున్నాయి. ఆర్డర్లు ప్యాసు అయినా డబ్బు చేతికి దొరుకుట చాలా కష్టంగా ఉంటోంది. దీని విషయమై శ్రద్ధ తీసుకోవలెనని కోరుతున్నాను. అవసరమైతే ఈవిషయంలో రూల్సును సడలించమని మంత్రిగారిని కోరుతున్నాను. ఒక్కొక్క గుడిసెలో 10 మంది 15 మంది నివసిస్తున్నారు. గ్రామాలలో ఉన్న భూములను వారు అడుగుతూంటే ఆ చిన్న ఉపకారం కూడ చేయ లేక పోతే ఎట్లాగ? వెంటనే ఈవిషయంలో ప్రభుత్వం చర్యతీసుకోవాలి. ల్యాండు రిఫారమ్సు అంటున్నారు. మొదట ఈ భూములు, యిండ్ల స్థలాలకోసం తీసుకొని హరిజనులకు యివ్వండి. తరువాత భూసంస్కరణలు చూచుకోవచ్చును. స్వరాజ్యం వచ్చిన తరువాత హరిజనుల పరిస్థితి బాగుపడి, తిండికి, బట్టకు లోటు ఉండదని ఊహించారు. దానికి తగ్గ కార్యక్రమం సరిగా అమలు జరుపుటలేదు.

వీవర్సు అసోసియేషన్స్ పెట్టి కోట్లకొలది రూపాయలు ఖర్చుపెడుతున్నప్పుడు చేనర్సు అసోసియేషన్స్ పెట్టి హరిజనుల వృత్తికి ఎందుకు సహాయపడకూడదు? అంటే నేను వీవర్సుకు వ్యతిరేకంగా మాట్లాడుతున్నాననికాదు. ఆ విధంగానే హరిజనులకు కూడ సహాయం చేయమని కోరుతున్నాను.

Tanning చేయడానికి అడవులనుంచి తంగేడు చెక్కను తీసుకొనివచ్చి అమ్ముతారు. దానిపై పన్ను వేస్తున్నారు. హరిజనులు పదిరూపాయల సరుకును,

ఒక రూపాయకు అమ్ముకొంటారు. దానిపై బజారువాళ్ళు లాభం సంపాదిస్తారు. పన్ను హరిజనులపై పడుతోంది. కాబట్టి ఆ పన్నును మినహాయించాలని కోరుతున్నాను.

ఇక స్కాలర్ షిప్స్ విషయంలో ఒక సంవత్సరం fail అయినట్లయితే స్కాలర్ షిప్స్ యిచ్చుటలేదు. మనం ఎందుకు ఆ స్కాలర్ షిప్స్ యిస్తున్నాం? హరిజనులలో విద్యావ్యాప్తి చేయడానికే కదా! ఒక సంవత్సరం fail అయినప్పటికి, యింకో అవకాశం యిచ్చి, ఆ మరుసటి సంవత్సరము కూడ చదువుకొనే అవకాశం కల్పించాలి. ఆ విధంగా చేసినట్లయితే, హరిజనులకు విద్య గరపించడమనే సమస్య పరిష్కార మౌతుంది. ఇండ్లు కాలిపోయినట్లయితే 4/=రూ. లో, 5/=రూ. లో. 10/= రూ.లో యిస్తున్నారు. ఆ డబ్బు తహసీలు కచ్చేరి చుట్టూ తిరుగుటకు అయిన ఖర్చులకు సరిపడదు. అధమపక్షం 50/=రూ. లో, 100/= రూ. లో. యిచ్చునట్లు, ఆ పైకము ఆలస్యం కాకుండా Social Welfare office వారే యిచ్చునట్లు చూడవలసినదిగా మంత్రిగారిని కోరుతున్నాను. నాకు అవకాశం యిచ్చిన అధ్యక్షుల వారికి ధన్యవాదములు.

శ్రీ కె. అంతయ్య (సంగారెడ్డి-రిజర్వుడు):- అధ్యక్షా ! మెదకు జిల్లాలో-సంగారెడ్డిలో ఒక హరిజన హాస్టలు యున్నది అక్కడ 50 మంది విద్యార్థులు ఉన్నారు. ఒక్కొక్క విద్యార్థికి 15/- రూ- ల వంతున యిస్తున్నారు. కాని అది అన్నానికి సరిపోవుటలేదని మనవిచేస్తున్నాను. అక్కడ సంవత్సరం అయిపోయినప్పటికి, యింకా స్కాలర్ షిప్స్ దొరకలేదు. ఆంధ్రలో ప్రతి తాలూకాలో, చాలాచోట్ల ఈ హాస్టల్సు ఉన్నాయి. తెలంగాణాలోకూడా అదే విధముగా పెట్టాలని కోరుతున్నాను. ఇండ్ల వసతి గురించి తగు శ్రద్ధ తీసుకోవాలని కోరుతున్నాను. నారాయణఖేడ్, జహీరాబాదు తాలూకాల్లో వాగువల్ల గుడిసెలు అన్ని కూలిపోయి, పాడైపోయినవి. అప్పుడే 4 సంవత్సరాలు అయినది. ఎన్నో అప్లికేషన్సు పెట్టుకొన్నారు. ఇంతవరకు ఏమీ జవాబు రాలేదు. ఒక్కొక్క కాగితం రెవిన్యూబోర్డుకు పోయిరావడానికి సంవత్సరాలు పడుతోంది.

జిల్లాల్లోపల కలెక్టరుగాని, డిప్యూటీ కలెక్టరుకాని, తహసీల్ దారుకాని తమ, తమ ప్రాంతాలలో హరిజనులకు ఇళ్ళ స్థలాలు కేటాయించుటలో, ఎక్కడి స్థలాలను అక్కడి వారికే కేటాయించి, సత్వరంగా వారి గృహ నిర్మాణానికి తోడ్పడవలెనని కోరుతున్నాను.

బడ్జెట్ లో కేటాయించిన డబ్బు Social Service Department నుంచి మాకు ఎంత వస్తోందో తెలియడంలేదు. పూర్వం జిల్లాకమిటీలు ఉండేవి. వాటి ద్వారా ప్రతి సంవత్సరం ఎంత వస్తోందో, ఎంత ఖర్చవుతోందో తెలిసేది. ఇప్పుడు

అట్టి ఏర్పాట్లు లేకపోవుటచే, ఎంత డబ్బు ప్రభుత్వం మాకోసం ఇస్తోందో, ఎంత ఖర్చవుతోందో తెలియడంలేదు. అందుచేత హరిజనులను తీసుకొని కమిటీలు ఏర్పాటుచేసి, మాకు కేటాయించే సొమ్ము పూర్తిగా వినియోగమగునట్లు చెయ్యాలని కోరుతున్నాను.

గాయరాన్, బంజరు భూములు హరిజనులకు పంచిపెట్టారు. అవి ఒక్కొక్క కుటుంబానికి రెండు ఎకరాలకు మించి రాలేదు. వీటిని ఆధారంచేసుకొని, తక్కావీ ఋణాలకోసం, ఎరువులకోసం దరఖాస్తు చేసుకొంటే, ఈ భూములు ప్రభుత్వానివి గనుక అప్పులు, ఎరువులు దొరకవని దరఖాస్తులను తిప్పివేస్తున్నారు. కాబట్టి ప్రభుత్వం ఈ భూములు ఇచ్చి చేసిన మేలేమిటి? ఈనాం భూములు, గ్రామానికి 1, 2 ఎకరాలు వెట్టికి ఏ విధంగా పట్టా లిచ్చారో, అదేవిధంగా మాకు కూడా పట్టాలు వెంటనే యివ్వాలని కోరుతున్నాను.

హరిజనులకు ఇండ్ల స్థలాలు ఎక్కడో ఊరుబయట కేటాయించకుండా, ఈ నాడు సాగుతున్న అస్పృశ్యతా నివారణ ప్రచారానికి అనుగుణంగా, పల్లెలలోను, పట్టణాలలోను మధ్య ప్రాంతంలో పాడుపడిన యిండ్లు, గోడలు పడినవి వుంటే మాకు కేటాయించమని మనవిచేస్తున్నాను.

బొంబాయి ప్రభుత్వం హరిజనుల కేసులు చూచుటకొరకు ప్రభుత్వ ఖర్చుపై ఒక లాయర్‌ను ఏర్పాటుచేసింది. అదేవిధంగా ఇక్కడకూడా ఏర్పాటుచేయించమని కోరుతున్నాను.

హరిజనులకు ఒక Tanning centre co-operative basis మీద ఏర్పాటు చేసుకున్నది-వుంది. దీనికి "తంగేడు గండి" అడవినుంచి ఉచితంగా తెచ్చుకొనుటకు అనుమతించాలని Forest Department కు 3, 4 దరఖాస్తులు పెట్టుకొన్నాము. కాని అది మాకు ఇవ్వకుండా వేలంవేయడం జరిగింది. అదే విధంగా పూర్వం మేము నీటి తుంగను, మా ఇండ్లపై కప్పుకోవడానికి, అడవులనుంచి ఉచితంగా తెచ్చుకొనేవాళ్ళం. కాని దానినికూడా ప్రభుత్వం ఈ సంవత్సరం వేలం వేసింది. ఈ రెండింటి విషయంలోకూడా ప్రభుత్వం తగు చర్యలు తీసుకొని హరిజనులు యథాప్రకారం అడవులనుంచి వీటిని ఉచితంగా తెచ్చుకొనే ఏర్పాట్లు చేయవలసిందిగా కోరుతున్నాను.

శ్రీమతి బి. రుక్మిణీదేవి (హిందుపూరు-రిజర్వుడు):- అధ్యక్షా! Social Welfare శాఖామంత్రిగారు ప్రవేశపెట్టిన demands ను బలపరుస్తూ వారి దృష్టికి కొన్ని విషయాలను తెస్తున్నాను. మనదేశం అన్ని రంగాలలోను పంచవర్ష ప్రణాళికల ద్వారా అభివృద్ధిచెందుతోంది. కాని పురోభివృద్ధిగాంచు నవభారతంలో హరిజనుల అభివృద్ధి చాల తక్కువ అనే చెప్పాలి. హరిజనాభివృద్ధికి, అస్పృశ్యతా

[ 13th March, 1958

నివారణకు కేంద్ర ప్రభుత్వం నిర్ణయించిన 10 సం॥ ల గడువు సమీపిస్తున్నది. కాని అస్పృశ్యతా నివారణకు, హరిజనాభివృద్ధికి దేశములో జరుగవలసిన సంఘ సంస్కరణ, సాంఘిక సంక్షేమం ఎంతేని కలదు. ఈ జాతి ఉద్ధరణ విషయంలో తలపెట్టబడిన కార్యక్రమములు జయప్రదమొంది, మనమాచరించిన సంఘ సమానత్వము లభించవలెనంటే సవర్ణులలో హృదయ పరివర్తనం రావడం, అస్పృశ్యులు అనే అజ్ఞాన అనాచారములు తొలగించుట ముఖ్యములుగా ఎంచి ప్రభుత్వం హరిజనాభివృద్ధి కార్యక్రమాలకు ఎక్కువ ప్రాధాన్యత ఇచ్చుచున్నది. కానీ, యిది అంతా one way Traffic పద్ధతిగా యున్నది. ఈనాటికీ గ్రామాలలోనే కాక, చిన్నచిన్న పట్టణాలలోకూడా సనాతనాచారపరాయణులైన సవర్ణులు శుభ్రత కలిగి, విజ్ఞానవంతులైన హరిజనులను అంటరానివారిగా పరిగణించి, హీనంగా చూడటం తటస్థిస్తోంది. కాబట్టి ఈ one way Traffic గా నుండు పద్ధతికాకుండా, హరిజనాభివృద్ధి కార్యక్రమములకు ప్రాముఖ్యత ఇవ్వడమేకాక, సవర్ణులలో హృదయపరివర్తనకు దోహదమిచ్చే కార్యక్రమాలను కొనసాగించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. మన దేశములో అక్షరాస్యులు తక్కువ. ఇంక ఆర్థికముగ, సాంఘికముగ వెనుకబడిన హరిజనులలో చాల తక్కువయని అందరికి తెలిసినదే. వీరి విద్యకుకూడా తగినంత ప్రోత్సాహము లభించుటలేదు. ఈనాడు సంఘంలో హరిజనులు ఆర్థికంగా, సాంఘికంగా చాలా వెనుకపడి ఉన్నారు. వారు తమ పిల్లలకు కావలసిన పుస్తకాలు, గుడ్డలు సమకూర్చుకొనే స్థితిలో లేరు. ఈ స్థితిలో ఉన్నందుననే హరిజనులు నిరక్షరాస్యులుగానుండుట సంభవించినది. గ్రామాలలోని హరిజనవెల్ఫేర్ పాఠశాలలలో చదివే విద్యార్థులకు నామమాత్రంగా పుస్తకములు, గుడ్డలు ఇస్తున్నారు. ఈ విధంగా కాకుండా ఇతర సంస్థలచేత నడుపబడే పాఠశాలలలో విద్య నభ్యసించే హరిజనవిద్యార్థు లందరికీ పుస్తకాలు, రెండు జతల గుడ్డలు ఇచ్చి విజ్ఞానయుతమైన విద్యావంతులుగా నొనర్చవలయును. విజ్ఞాన విలసితమైన విద్యావంతు లున్ననాడే సంఘాభివృద్ధి, దేశాభివృద్ధి జరుగును. విజ్ఞాన విలసితమైన విద్యను వారికి యిచ్చిననాడే అది సాధ్యంకాని అన్యథా జరుగదు. కేంద్ర ప్రభుత్వం కళాశాలలలో సాంకేతిక విద్యనభ్యసించు హరిజన విద్యార్థులందరికి విద్యా వేతనాలు ఇచ్చి వారిని విద్యావంతులుగా ఒనర్చుచున్నది. అదేవిధంగా ఉన్నత విద్యాభ్యాసానికి హరిజన విద్యార్థులందరికి ఉచిత వేతనాలు ఇవ్వాలని కోరుతున్నాను. ఈ సంవత్సరం విద్యావిధానంక్రింద ఖర్చుపెట్టే రు. 10 లక్షలు చిల్లర ఏమాత్రం సరిపోదు దీన్ని ఎక్కువ చేయవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతున్నాను. హరిజనులకిచ్చే ఇండ్ల స్థలాలకు చాలా తక్కువ మొత్తం ఖర్చుపెట్టబడుతోంది. ఈ విధంగా ఖర్చుపెడితే ఈ సమస్య దాదాపు రెండు శతాబ్దాలకు కాని తీరదు. దాదాపు తొమ్మిది లక్షల గృహ స్థలాల అవస్యకత ఉన్న ఆంధ్ర

13th March, 1958]

ప్రదేశ్ లో ఇందుకొరకు రు. 5, 6 కోట్ల రూపాయలయినా ఖర్చుపెట్టవలసివుంది. కాబట్టి ప్రభుత్వం ఈ సమస్య సత్వర పరిష్కారానికి ఎక్కువ ప్రాధాన్యం ఇవ్వ వలసిందిగా కోరుతున్నాను. ఈ సమస్య గ్రామాభివృద్ధి కార్యక్రమములలో చేర్చిన బాగుండును. హరిజనులకిచ్చే బంజరు భూముల విషయంలో, గృహస్థలాల విషయంలో చాలా అన్యాయాలు, అక్రమాలు, జరుగుతున్నాయి. వీటి సత్వర నివారణకు తగు చర్యలు తీసుకోవలసిందని ప్రభుత్వాన్ని కోరుతున్నాను.

హరిజన, వెనుకబడిన తరగతుల విద్యార్థుల వసతిగృహములలో గత జూన్ నెలనుండి ప్రాథమిక విద్యార్థులకుకూడా ప్రవేశం కలిపించారు. అందుచేత ఉన్నత తరగతులలో చదివే విద్యార్థులకు వసతి గృహాలలో ప్రవేశము లేకుండా పోతోంది. ఈ క్రొత్తగా చేర్చుకొనబడే విద్యార్థులకు ప్రతి సంవత్సరము ప్రభుత్వము విరివిగా additional grants యివ్వదు. కాబట్టి ప్రాథమిక విద్యాలయాలు గ్రామాలలో వుంటాయి గనుక, ప్రాథమిక విద్య ముగించుకొని I st form లో చేరే విద్యార్థులకుమాత్రమే ఈ వసతి గృహాలలో ప్రవేశం కల్పించిన బాగుండును. ఈ విధముగా చేసిన హైయ్యర్ ఫారముల విద్యార్థులకు ఉన్నత విద్యాలయము లలో చేరి చదువు అవకాశము విరివిగా లభించగలదు కాబట్టి ప్రాథమిక విద్యార్థు లకు ఈ వసతి గృహములలో అవకాశము లేకుండ చేయుట మంచిది. ప్రాథమికో పాధ్యాయులుగానుండి, హాస్టలు మేనేజర్లుగా వ్యవహరించువారు తమ పాఠశాల లకు ఫీడర్ గా ఏర్పడుటకు వసతి గృహములందు ప్రాథమిక విద్యార్థుల కవకాశము కల్పించి ఉభయత్రా లాభము పొందు స్వార్థపరులకీ పద్ధతి బాగున్నది. కాని జాతి అభివృద్ధి దృష్ట్యా ఈ పద్ధతి అనవసరము. ఈ పద్ధతి సత్వరముగ తొలగించ వలసినదిగా ప్రభుత్వమును కోరుచున్నాను.

Anantapur లో ఉన్న Government Harijan Girl's Hostel కు, నా విజ్ఞాపనము మన్నించి, మంత్రిగారు, అక్కడ, ఒక B.A.LT., Matron ను ఏర్పాటు చేసినందుకు వారికి కృతజ్ఞురాలను. కాని ఇంతవరకు ఆ matron రాలేదు. ఈ సంవత్సరంకూడ ఆ hostel కు ఖర్చు పెట్టబడుతున్న డబ్బు వృథాగా ఖర్చు అవుతున్నది. పిల్లలయొక్క విద్యాభివృద్ధి చాల కుంటుపడుతున్నది. కాబట్టి త్వర లోనే ఆ matron ను అక్కడకు పంపుతారని ఆశిస్తున్నాను.

ఈ సంఘ సంక్షేమాశాఖ ఉద్యోగులు చేయుపని ఏమంత లేకున్ననూ, పలుమార్లు గ్రామ సంచారం చేస్తూ ఎక్కువగా ప్రయాణ ఖర్చులు తీసుకుంటు న్నారు. మొత్తం ఈ పద్దులో కేటాయించిన దానిలో నాల్గవ వంతు ఈ ఉద్యో గుల జీతభత్యాలకు, ప్రయాణఖర్చులకే హరించిపోతున్నది. వీరు చేసేపని స్వల్పము. ఖర్చు ఎక్కువ, వీరు చేసే పనులలో ఆలస్యము అంతకంటే ఎక్కువ. కాబట్టి వారి దుబారా ఖర్చులను, మందకొడి తనాన్ని నివారించాలని కోరుతున్నాను.

[ 13th March, 1958

హరిజనుల ఆర్థికాభివృద్ధికి దోహదం ఇచ్చే కుటీర పరిశ్రమలైన, చేనేత-చర్మకారక పరిశ్రమలను, సంఘ సంక్షేమ కార్యక్రమాలలో చేర్చి, వాళ్ల ఆర్థికాభివృద్ధి బాగుపరచేటట్లు ఈ శాఖ ఉద్యోగులు సర్వదా ప్రయత్నించాలని ప్రభుత్వాన్ని కోరుతున్నాను. సంవత్సర క్రమేణా పెరిగే ఈ హరిజనాభివృద్ధికి సంవత్సర క్రమేణా ఈ పద్దు క్రింద కేటాయించే మొత్తము హరిజనుల అవసరములను ఏమాత్రము తీర్చజాలదు. పతితులై అన్ని విధాలా వెనుకబడి ఉన్న ఈ హరిజనుల పురోభివృద్ధియే దేశాభివృద్ధి. వీరి అభివృద్ధికై నిర్ణయించిన 10 సంవత్సరాల గడువు ఇంకొక రెండు సంవత్సరాలలో తీరిపోవుచున్నది. కాని మన Budget లో ఈపద్దు క్రింద చాల స్వల్పమైన మొత్తాన్ని కేటాయించినందుకు చాలా విచారిస్తున్నాను. దగ్గరపడుతున్న గడువును గుర్తించుకొని, ఈ పద్దుక్రింద ఎక్కువ మొత్తాన్ని కేటాయించి, హరిజనులను ఆర్థిక, సాంఘిక, రాజకీయ, వైజ్ఞానిక రంగాలలో అభివృద్ధి పర్చాలని కోరుతూ, ఈ అవకాశం ఇచ్చిన అధ్యక్షుల వారికి నా ధన్యవాదములు అర్పిస్తున్నాను.

**శ్రీ బి. సుబ్బారావు** (బూరుగుపూడి - రిజర్వుడు) : అధ్యక్షా! హరిజన అభ్యుదయము కాగితాలలోను, మాటలలోను, ఉన్నంతగా ఆచరణలో జరగడం లేదు. స్వరాజ్యము వచ్చి 10 సంవత్సరాలు అయినప్పటికినీ, పల్లె గ్రామాలలో ఈ హరిజనుల ఇళ్ళ సమస్య ఇంతవరకును, ఈ ప్రభుత్వము పరిష్కరించలేదని మనవి చేస్తున్నాను. అన్నింటికంటే ఈ హరిజనుల ఇళ్ళ సమస్య చాల ముఖ్యమైనదని, అనేకసార్లు ప్రభుత్వానికి విన్నవించినా, ఎందువల్ల నిర్లక్ష్యము చేస్తున్నారో తెలియకుండా ఉన్నది. ప్రకాశం పంతులుగారి ప్రభుత్వంలో హరిజనుల ఇళ్ల స్థలాల గురించి ఒక కోటి రూపాయలు కేటాయించారు. గృహనిర్మాణ విషయములో చేనేత వారికి, 1,200/- రూపాయలు ఉచితంగాను, 2,400/- రూ. 30 సంవత్సరాలలో తీర్చుకునే పద్ధతిలోను ఇచ్చుటకు ఒక Scheme ను తయారు చేశారు. అదే విధంగా ఆ Scheme ను హరిజనులకు కూడ అమలు పర్చాలని కోరుతున్నాను.

ఎంతో కాలమునుంచి ఎందుకూ పనికిరాని "పోరంబోకు" భూములను, సాగుకు వీలు అయిన విధంగా మరమ్మత్తుచేసి, కష్టపడి సుమారు 10, 12 సంవత్సరాలనుంచి సాగుచేసుకుంటున్న హరిజనులకు ఈనాటి వరకు, పట్టాలు ఇవ్వకుండ విపరీతమైన Penalty లు కట్టమని బాధించడం చాల విచారకరమైన విషయము. సాధ్యమైనంత వరకు ఈ భూములను, Penalty లు లేకుండ, పట్టాల మీద ఇవ్వవలసిందని అన్ని పక్షాల సభ్యులు పదేపదే చెప్పుచున్నారు. ప్రభుత్వమువారు యీ విషయంలో ఏమీ ఆలోచించకుండా Penalty లు కట్టమని బాధపెడుతున్నారు.

అంతేకాకుండ, లంకభూములను 3 సంవత్సరాలు దామాషాకట్టి, Field Labour Co-operative Societies కు Lease మీద ఇస్తున్నారు. ఈ 3 సంవత్సరాల గడువు చాల హెచ్చు అయిపోయి, హరిజన Societies వారు, విపరీతమైన నష్టాలకు గురి అవుతున్నారు. కావున ఈ దామాషాను రద్దుపరచి, ఏదో నామకః 5/- లేక 6/- రూపాయలు కట్టాలని నిర్ణయించి ఈ లంక భూములను హరిజనులకు ఇప్పించాలని పదేపదే చెప్పుచున్నాము. గాని ఆ విషయంలో కూడ, ప్రభుత్వము వారు ఏ విధమైన మార్పు తీసుకురాలేదు. ఈ Societies ను వృద్ధి చెయ్యదలుచుకుంటే ఈ దామాషాను రద్దుపరచి ఎకరానికి 5 లేక 6 రు॥ల చొప్పున కట్టి సొసైటీలకు లీజుమీద యిచ్చుట చాల అవసరం. అంతే కాకుండా ఈ భూములను Private గా వేలం పాడుకున్న రైతులకు enhancement ఏమీ ఉండదు. కాని Societies కు మాత్రం Lease కే ఇస్తే enhancement ఉంటుంది సొసైటీస్‌కు కూడ ఆ enhancement లేకుండ చెయ్యాలని మనవి చేస్తున్నాను

తరువాత పల్లె గ్రామాలలో నూటికి 75 మంది అక్కడక్కడ వ్యవసాయ కూలీలుగా జీవిస్తున్నారు. వీరికి సంవత్సరానికి అనేక రోజులు పనిలేక పోవడంవల్ల వాళ్ళ కుటుంబాలను పోషించుకోవడంలో అనేక ఇబ్బందులకు గురి అవుతున్నారు. అందువల్ల పల్లెలలో small scale industries ను Co operative basis మీద ఏ ప్రాంతానికి ఏ Industry వీలుఅవుతుందో, ఆప్రాంతంలో అటువంటిది ఏర్పాటు చేసి ఎక్కువ Subsidy ఇవ్వాలని మనవి చేస్తున్నాను.

హరిజనులలో చాలా మంది III rd form లగాయతు S. S. L. C. వరకు చదువుకొన్నవారు ఏ విధమైన ఉద్యోగాలు లేకుండా ఖాళీగా యున్నారు. అట్టి వారు ఉద్యోగాలు లేకను, ఇటు వ్యవసాయపు పనులు చేతకాకను రెండు విధాల పాడై పోవుచున్నారు. అటువంటి వాళ్ళకు Vocationl Schools పెట్టి వాళ్ళకు stipends ఇచ్చి ప్రోత్సహించాలని మనవి చేస్తున్నాను.

ప్రస్తుతము school final pass అయ్యి, Type and Shorthand నేర్చుకునే వాళ్లకే Stipend ఇస్తున్నారు. School Fnal Pass అయిన వారు Service Commission Examination కు appear అయి, ఏదో విధంగా ఉద్యోగం సంపాదించుకోగలరు. కాని Fail అయిన candidate ఉద్యోగం దొరకక బాధపడుతూ ఉంటాడు కాబట్టి candidate, school final fail అయినా సరే type and shorthand నేర్చుకునేవాళ్లకు ఈ stipend చాల అవసరం అని, ప్రభుత్వానికి మనవి చేస్తున్నాను.

ఇక ఈ services విషయంలో హరిజనులను recruit చేసినప్పుడు, వాళ్లకు ఇంత reservation అని ఉన్నది. కాని promotions విషయంలో ఆ reservation

ఉన్నట్లు కనిపించదు. కాబట్టి promotions లో కూడ ఈ reservation ఉండాలని మనవి చేస్తున్నాను.

Service Commission లో ఒక హరిజన మెంబరు ఉండడము చాల అవసరం.

ఇక National Extension Scheme లో ఎంతో డబ్బు ఖర్చుపెడుతున్నారని చెబుతున్నారు. కాని ఆ డబ్బును హరిజనులు ఏ విధంగాను ఉపయోగించుకోలేక పోతున్నారు. సగం contribution ఇస్తేనే గాని వారు ఏపని చెయ్యడానికి వీలులేకుండా ఉన్నది. కాని ప్రస్తుత పరిస్థితుల దృష్ట్యావారు ఈ సగం contribution కూడ ఇచ్చుకోలేని స్థితిలో ఉన్నారు. కాబట్టి ఏ నాల్గవ భాగమో లేక అయిదవ భాగమో ఒక కనీస పరిమితిని హరిజనుల విషయములో పెట్టాలని మనవి చేస్తున్నాను.

1953 వ సంవత్సరం వచ్చిన వరదలలో ఇళ్లు కూలిపోయిన సందర్భంలో ప్రభుత్వం హరిజనులకు అప్పులు ఇవ్వడం జరిగింది. ఇలాంటి అప్పులను ఇప్పుడు మళ్లీ ఇవ్వడానికి ప్రభుత్వము నిర్బంధిస్తున్నది. పాత అప్పులను subsidy, క్రింద treat చేస్తూ, write off చేస్తే హరిజనులు చాల సంతోషిస్తారు. కాబట్టి ఈ విషయం గమనించాలని మనవి చేస్తున్నాను. ఏమైనప్పటికీ హరిజన సమస్య కేవలం మాటలతో పరిష్కారమయ్యే సమస్యకాదు. హరిజన సమస్య కేవలం ఆర్థికసమస్య కాబట్టి ముఖ్యంగా వారి ఆర్థిక పరిస్థితులు బాగుచేయవలసి ఉన్నది.

భూముల విషయంలో హరిజన మంత్రిగారికి సంబంధం లేకపోయినప్పటికీ వారు రెవెన్యూశాఖ వారితో సంప్రదించి పోరంబోకు భూములను సాగుకు ఇచ్చుటకు ఉన్నటువంటి ban ను lift చేయిస్తారని ఆశిస్తూ ఇంతటితో విరమిస్తున్నాను.

శ్రీ యస్. కె. వి. కృష్ణావతారం (తాడేపల్లిగూడెం-జనరల్):- అధ్యక్షా! ఈ డిమాండును నేను బలపరుస్తున్నాను. కాని ఆంధ్రప్రదేశ్ లోనూ, దేశం మొత్తంలోనూ నూటికి 60 వంతులుగల హరిజనుల, వెనుకబడిన జాతుల, విముక్త జాతులవారి అభివృద్ధి నిమిత్తం కేటాయించబడిన మొత్తం చాలా తక్కువని మనవిచేస్తున్నాను. They are a source of very great strength to our State and our country; and they constitute a very great asset to our nation and our State. ఆ కారణంచేత వారి అభివృద్ధిమీద రాష్ట్రాభివృద్ధి, దేశాభివృద్ధి ఆధారపడివున్నది. ఈ డిమాండుమీద కనీసం 5, 6 కోట్ల రూపాయలయినా ప్రత్యేకించవలసినదిగా శ్రీమతి రుక్మిణమ్మగారు విజ్ఞప్తి చేశారు. నేను వారితో ఏకీభవిస్తున్నాను. హరిజనులలో, వెనుకబడిన జాతులలో, విముక్తజాతు

13th March, 1958]

లల్లో విద్యావ్యాప్తి గావించాలి. వీరికి విద్య, అధ్యయనం నిమిత్తం ఎక్కువఖర్చు అవుతున్నదని మంత్రివర్యులు చెప్పారు. విద్యావ్యాప్తి విషయంలో special fees scholarship తో పాటు వారికి examination fees రద్దుచెయవలెను. వారి కది చాలా భారంగా వుంది. వారిలో విద్యా, అధ్యయనం ఎక్కువగా గరపి వారిని విజ్ఞానవంతులుగాచేసి వారికి ఆత్మగౌరవ ప్రతిపత్తులను కలుగ జేయడం చాలా మంచిదే. కాని రెక్కాడితేగాని డొక్కాడని పరిస్థితిలో వారుండగా వారి ఆర్థిక పరిస్థితిని చక్కబరిస్తేగాని ప్రయోజనం లేదు. బడికి పోయి నేర్చుకునే వాతావరణం వారి కుటుంబాలకు కలుగజేస్తేగాని కేవలం విద్యావ్యాప్తికి చేసిన కృషి అట్టే ప్రయోజనకరంగా వుండదని మనవిచేస్తున్నాను. మన హిందూ సంఘంలో వేల సంవత్సరాలుగా వారిని బయటవుంచి వారికి చాలా అపచారం చేశామనే భావంతో నేను చాలా బాధపడుతున్నాను. అలాంటి పరిస్థితిలో మనం చేసిన పాపంనుండి మనం విముక్తిచెందాలంటే యింకా ఎక్కువ డబ్బును వారికొరకు ఖర్చుపెట్టి వారి అభ్యుదయమునకు పాటుపడాలని మనవిచేస్తున్నాను. బంజరు భూముల విషయంలో వారికి జరుగుతున్న అన్యాయాలు చాలావున్నాయి. 75 వేల ఎకరాల బంజరు భూమిని హరిజనులకు assignment చేయడం జరిగిందని రెవిన్యూ మంత్రిగారు చెప్పారు. కాని చాలా రహస్యా లున్నాయి. మా పశ్చిమ గోదావరి జిల్లాలో చింతలపూడి, తాడేపల్లిగూడెం తాలూకాలలో జరిగిన అన్యాయాలను మంత్రివర్యుల దృష్టికి, కలెక్టరుగారి దృష్టికి, రెవిన్యూబోర్డు సభ్యులు శ్రీ సుబ్రహ్మణ్యంగారి దృష్టికి నేను తీసుకొనివచ్చాను. ఆస్తులున్నవారికే, పెళ్ళాం పేర ఆస్తి వుంటే మొగుడుపేర, మొగుడుపేర ఆస్తి వుంటే పెళ్ళాం పేర యీ విధముగా అగ్రజాతులవారికే ఎవరికీ తెలియకుండా assignment proposals పంపి పట్టాలు తెప్పించడం చాలా జరుగుతున్నది. ఇది చాలా దారుణం. దీనిని ప్రతిఘటించాలి. దీనిని కేవలం అధికారులమీదే వదలిపెడితే ఇది గుప్తంగా జరిగిపోతూ వుంటుంది. కాబట్టి యీ బంజరు భూముల పంపిణీ కొరకు ప్రముఖ వ్యక్తులతోను, శాసనసభ్యులతోనూ కూడిన కమిటీలను ప్రతి తాలూకాకు వేస్తేగాని యీ రహస్యములు బయటపడవు. నేను పెద్ద enquiry జరిపించాలని కోరాను. enquiry చేస్తున్నాం అంటున్నారు. దానిగురించి మాత్రం యింతవరకు తెలియపరచడంలేదు. మిత్రులు శ్రీ సుబ్బారావుగారు చెప్పినట్టుగా హరిజనులు చాలాకాలంనుంచి చేసుకొంటున్న భూములను వెనుకబడిన జాతులవారు చాలా కాలంనుంచి చేస్తున్నభూములను objections లేనిభూములకు ban lift చేసేవరకూ assign చేయడానికి వీలులేదనే సాకుతో పెనాల్టీలు వేస్తున్నారు. వారి పెనాల్టీ భారాన్ని మోయలేక చాలా బాధపడుతున్నారు. కాబట్టి వీరికి assignment జరిగే లోపల అలాంటి penalty లు లేకుండా ప్రభుత్వం steps తీసుకోవాలి.

[13th March 1958

సమాజ వికాస కేంద్రములలో జాతీయ అభివృద్ధి కేంద్రములలో హరిజనులకు ప్రయోజనములు కలుగడంలేదు అని చెబుతున్నాను. చాలమంది మిత్రులుకూడా దానినిగురించి చెబుతున్నారు. హరిజనుల విషయంలో కొంత realiation తీసుకు రావాలని కేంద్ర ప్రభుత్వానికి వ్రాయాలి. జాతీయ వికాస కేంద్రములలో ప్రణాళిక నిబంధనల ప్రకారం వెనుకబడిన జాతులు Contribution యిచ్చుకో లేరు. శ్రమదానం యిచ్చుకోవచ్చునని కొంత మంది అంటున్నారు. కాని రెక్కాడితేగాని - డొక్కాడని పరిస్థితిలో వారున్నారు. ఏ రోజు కారోజు కష్టపడి పనిచేస్తేగాని ఆ రోజు తిండిలేని పరిస్థితిలో వారు శ్రమదానం యిచ్చే పరిస్థితిలో కూడా లేరు. ఇది చాలా ముఖ్యమైన విషయం. దీనిని గురించి శ్రద్ధ తీసుకోవాలని మంత్రిగారిని ప్రార్థిస్తున్నాను. Legal aid గురించి ఒక సారి ప్రశ్నోత్తరముల సమయంలో ప్రశ్న వచ్చినప్పుడు criminal matters లో Judge amicus curied ని నియమించడానికి అధికారం వున్నట్లు Civil matters లో కూడా ఏదో Procedure వుందని అన్నారు. కాని న్యాయవాదిగా నాకున్న 20 సంవత్సరాల అనుభవంలో ఒక్క Civil case లో నయినా legal aid యిప్పించినది లేదని నేను నొక్కిచెబుతున్నాను. నేను దీనికి ఒక విధానమును సూచిస్తున్నాను. చాలా Case లలో Legal Aid లేకపోవడంవల్ల వారికి నిజమైన వాదన, బలమైన వాదన వున్నప్పటికీ కూడా వాదించుకో లేక 1, 2 వాయిదా లకు కోర్టుకువచ్చి తరువాత ex-party కావడం జరుగుతున్నది. కాబట్టి ఏ జడ్జి ముందర, ఏ మునసబు ముందర, ఏ కోర్టు ముందర ఏ cause అయితే వుందో ఆ జడ్జి అందులో వాదన వుందనీ, prima facia case వుందని certify చేస్తే వారికి Legal aid యివ్వవచ్చు. దానికి సంబంధించిన ఖర్చులన్నిటినీ ప్రభుత్వమే పెట్టుకోవచ్చును. Civil Procedure Code తోటి అనుబంధమైన civil rules of practice ను మార్చి ప్రత్యేకమైన నిబంధనలు చేయనంతకాలం కలెక్టరుకే యింకా అధికారం యిచ్చి వారిదగ్గర దరఖాస్తులు పెట్టుకొని విచారణ చేసుకొని అదంతా జరగాలంటే చాలా ఆలస్యం అవుతుంది. ఈ విషయం బాగా ఆలోచించా లని కోరుతున్నాను. Social Welfare Committee లు ఏమిపని చేస్తున్నారో ఎవరికీ తెలియడం లేదు. అవి function కావడంలేదు. Meeting లు సక్రమంగా జరగడం లేదు. మిత్రులు శ్రీ వేమయ్యగారు Menial Services కు సంబంధించిన విషయం చెప్పారు. నాకు ప్రత్యేకమైన అనుభవంవుంది. ఇంట్లో పనిచేస్తారనే ఉద్దేశ్యంతో గుడ్డలు ఉతికే రజకులను ఏ ఉద్యోగి అయినా వేసురుంటున్నాడు. దానివల్ల దోభీ ఖర్చులు ప్రజలకెక్కువయి పోతున్నాయి. హరిజనులను ఏ ఉద్యోగీ పెట్టుకోడం లేదు. ఇలాంటి కేసులు కొన్ని వెతికి తీసి ఆ ఉద్యోగిమీద తీవ్రమైన చర్యతీసుకోవాలి. అమ్మగారికి, అయ్యగారికి గుడ్డలు శుభ్రంగా వుతుకుతారనీ,

13th March 1958]

ఇంటి పనులు చేస్తారనీ రజకులను యీవిధముగా ఉపయోగిస్తున్నారు. ఈ విషయంలో తగిన చర్యతీసుకోవాలని చెబుతూ సావకాశం లేనందున ముగిస్తున్నాను.

**శ్రీ ఉప్పల మలుసూర్ :** అధ్యక్షా, సాంఘిక సంక్షేమశాఖామంత్రిగారు వెనుకబడిన జాతుల అభివృద్ధికొరకు demand ను ప్రవేశపెట్టుతూ దీర్ఘోపన్యాసము చేశారు. వారు ఈనాడు చెప్పిన విషయాలన్నీ మునుపు చెప్పినవే. మరల వాటినే ఇప్పుడూ చెప్పినారు. వెనుకబడిన జాతుల వసతులకొరకు డబ్బు కేటాయించామని చెపుతున్నారు. ఇదిఅంతా generalise చేసి చెప్పడానికి వీలులేనందున 1, 2 విషయాలు చెప్పి ముగించడానికి ప్రయత్నిస్తాను. గ్రామాలలో హరిజనుల అభివృద్ధి ఎట్లావున్నదో కొంచెము చెపుతాను. నేను దాదాపు 1952 వ సం॥ నుంచి M. L. A., గా వుంటున్నాను. పదే పదే ఈ సమస్యలను గురించి చెపుతున్నాను. కాని నేను చెప్పిన విషయాలలో 10 శాతమైన గవర్నమెంటు విచారణచేసి, పరిశీలించడానికి పూనుకొనలేదు. గత సమావేశములో చెప్పాను. మా constituencyలో 156గ్రామాలువున్నవి. వాటిలో 100గ్రామాలనుంచి ఇళ్లకొరకుస్థలాలు కావాలని దరఖాస్తులు పెట్టుకున్నారు. ఒక్క కుటుంబము నివసించడానికి వీలైన యింటిలో నాలుగైదు కుటుంబాల వారు వుండవలసి వస్తున్నది. ఇండ్లస్థలాలు కావాలని దరఖాస్తులు పెట్టుకొని ఆఫీసుల చుట్టూ తిరగవలసివస్తున్నది. ఆఆఫీసులలో ఇచ్చిన దరఖాస్తులను పరిశీలించినట్లు లేదు. ఉదాహరణకు దరఖాస్తులు ఎన్ని గ్రామాలనుంచి వచ్చినవని అడిగితే 91 గ్రామాలనుంచి వచ్చినవని చెప్పిరి. అందులో 25 మందికి మాత్రయే భూమి యివ్వబడినది. మిగిలినవి pending లో వున్నవి. Land acquisition విచారణ జరుగుతున్నదని నాప్రశ్నకు సమాధానమిచ్చారు. గత Budget session లో మంత్రిగారికి details తో ఒక వ్రాత memo ను సమర్పించినాము. ఎన్నిగ్రామాలనుంచి దరఖాస్తులు వచ్చినవి, ఎన్ని పెండింగులో వున్నవి అని వారివద్ద interview కు పోయి అడిగితిమి. Land Acquisition Act క్రింద emergency provisions ప్రకారం వున్న భూమిని తీసుకొని వారికి ఇళ్లకొరకు స్థలాలు యివ్వమని కలెక్టరులకు orders యిచ్చినామని చెప్పారు. కాని యింతవరకు ఆ memo కు సమాధానము లేదు. పరిష్కరించినట్లు లేదు.

అయిదారు సంవత్సరములనుంచి సూర్యాపేట తాలూకాలోని హరిజనులు ఇళ్ల స్థలాలకొరకు దరఖాస్తులు పెట్టుకొనుచున్నారు. కాని గ్రామాలలోవున్న పెత్తందారీ వర్గము ఎట్లావత్తిడి చేసిందీ చెప్పక తప్పిందికాదు. దాదాపు ఆరు సంవత్సరముల క్రితము వెంపటి గ్రామములోని హరిజనులు ఎటూవెళ్లడానికి వీలులేకుండా వుండేది. హరిజనుల ఇండ్లగోడలే భూస్వామ్యవర్గపు పెరటి భూము

[ 13th March 1958

లకు కంచెలు మాదిరిగా వున్నవి. వందలపైన ఎకరాలువున్న ఆభూస్వామి భూమిని సర్వేచేసి, మంజూరుచేసి, మరల దానిని pending లో పెట్టి విచారిస్తున్నా మని అంటున్నారు. గుంజలూరు గ్రామములో కన్మంతరెడ్డి రామిరెడ్డి అనే పెద్ద దేశ్ ముఖ్ వున్నాడు. ఆయనది అసలు నేలమర్రు గ్రామము. ఇండ్లమధ్యలో ఉన్న పెరడును మంజూరు చేయమని కోరితే అది సర్వేచేస్తానంటాడు. అంతటితో ఆపని ఆగిపోయింది. ఈ సమస్య ఇంతవరకు పరిష్కారము కాలేదు. అట్లాగే ఉషణాబాదు గ్రామములోని హరిజనులు తమరమ గ్రామంచుట్టూ వున్న పెరడునే వారికి యిళ్లు కట్టుకోవడానికి permission యివ్వండి అంటే ప్రభుత్వం యిస్తానని చెప్పింది; ఆ భూములు మాకు మంజూరు చేయలేదు సరికదా మాకు చూపించిన వేరే భూమిని సేద్యము చేసుకొంటాము అంటే ఆ భూమిని సర్వేచేసి, తరువాత ఆగిపోయిందని చెప్పారు. వెలుగుపల్లి గ్రామము వుంది. ఆ గ్రామప్రజలు 1953 లో బూర్గుల రామకృష్ణరావుగారు ముఖ్యమంత్రిగా వున్నపుడు హరిజనులు రాయ బారం వచ్చి దరఖాస్తులు యిచ్చినారు. ఇంతవరకు ఆసమస్య పరిష్కారము కాలేదు. వీటన్నింటికి కారణము ప్రభుత్వంయొక్క నిర్లక్ష్యమా! లేక అధికారుల తాకీదులవల్ల అట్లా చేస్తున్నారో నాకు అర్థము కావడము లేదు. చిన్న నెమిలి గ్రామములో కోమటి కోసం పుల్లయ్య అనే ఆయన భూమిని మంజూరుచేశారు. కోమటి వెలుగపల్లి పోయి వచ్చేటప్పటికి ఆ ఉద్దేశ్యము మారిపోయింది. ఆయన తహసీలుదారుతో ఏమి మాట్లాడి వచ్చినాడో తెలియదు. ఇట్లా అయిపోయిన దరఖాస్తులు అనేకం వున్నవి. ఇప్పటికి వచ్చిన 91 దరఖాస్తులలోను 40 మంజూరు చేయబడినవి; 25 ఇండ్లకు మాత్రమే స్థలాలు ఇవ్వబడినవి. మిగిలినవి యివ్వకుండా చేశారు. ఈ ఇచ్చిన 25 స్థలాలుకూడ గ్రామానికి 3 ఫర్లాంగులు 4 ఫర్లాంగుల దూరములో వున్నవి. భూమిని యిచ్చినాము దానిలో ఇండ్లు కట్టుకోమంటే ఇప్పటికే చాల దూరమున వున్నాము. ఊరు బయట ఇస్తే వూరిలోనికి వచ్చే దెప్పుడు, మా అవసరాలు తీర్చుకొనే దెప్పుడు, మేము కాపురాలు చేసేది ఎట్లా అని హరిజనులు దానిని వ్యతిరేకించారు. దానికి వేరే మార్గం చూపకుండా వుంచారు. రోజువారి కాలకృత్యాలుకూడా తీర్చుకొనడానికి అవకాశాలు లేని గ్రామాలు వున్నవి ప్రభుత్వోద్యోగులు పోయి చూసి దానికి మార్గమేమీ చూపెట్టలేదు. వెంపటి, ఆత్మకూరు, తుమ్మల, పెదమ మొదలగు గ్రామాలలో భూస్వాములు హరిజనుల కోళ్లు బయటకు వెడితే శిక్షలు వేయడము, జరిమా నాలు విధించడము జరుగుతోంది. ఇదంతా గ్రామాభివృద్ధి అనుకోవాలా? ఇవి ఏమైనా కొత్త proposals అని అనుకోవాలా? బడ్జెటులో కేటాయించాము కాబట్టి ప్రాథమిక దశను ముందు బాగుచేస్తామని సమాధానము చెప్పవలసిన అవ సర మున్నది. అట్లాగే బావులు వున్నవి. ఈ బావుల సమస్య గురించి అనేక

రిపోర్టులు వచ్చినవి. నా constituency లోని గ్రామాలకు పోయి సంగతులన్నీ తెలుసుకొన్నాను. ఫలానా బావి ఫలానా గ్రామములో ఈ విధముగా వుందని చెపుతాను. గాజుల మలకాపురంలో మంచినీటి బావి వుంది. గ్రామములోనుంచి వచ్చే మురుగునీరు మొత్తము అంతా ఆ బావిలో పడుతుంది. ఆ నీరు చెడిపోయి దానిని త్రాగిన హరిజనులు మరణించడముకూడ జరుగుచున్నది. ఈ బావి ప్రభుత్వముకూడ త్రవ్వించలేదు. మరమ్మతు చేయించమంటే అదికూడ చేయించలేదు. ఇటువంటి నీరు త్రాగి అనేకమంది రోగాలకు గురిఅవుతున్నారు. ప్రజారోగ్యము కొరకు డబ్బు కేటాయించామని చెప్పారు. విద్య, విజ్ఞానం గురించి ఒక మాట చెపుతాను. మంత్రిగారు Hostels పెట్టించామని, students కు scholarships యిస్తున్నామని చెప్పారు. వెనుకబడిన జాతులవారికి విద్యయే లోపమని అంగీకరించామని చెప్పారు. సంతోషమే నిర్బంధముగా విద్య చెప్పించాలనే చట్టాన్ని వర్తింపజేశారా? గ్రామాలకు వెళ్ళి పిల్లల తలిదండ్రులకు నచ్చజెప్పి "మీ పిల్లలకు చదువు చెప్పించాలి. మీరు డబ్బు ఏమీ పెట్టుకోనవసరములేదు. వారికి కావలసిన అన్ని సౌకర్యాలు కల్పించి విద్య చెప్పిస్తాము". అని ఏర్పాట్లు చేశారా? ఇది అంతా కేవలము కాగితాల రూపములోనే వుండిపోయింది. Hostels పెట్టాము అన్నారు. ఈ Hostels ప్రైవేటు రంగానికి సంబంధించినవి కాబట్టి వాటిమీద ఎక్కువ చెప్పాలో లేదో నాకు తెలియదు. కాని ప్రభుత్వము hostels ను అన్నిచోట్ల పెట్టడంలేదు. మా తాలూకాలోని ఒక పట్టణములో ప్రైవేటు హాస్టల్ వుంది. దానిలో 99 మంది విద్యార్థులు వున్నారు.

హరిజన విద్యార్థులకు స్కాలరుషిప్పులు సరిగా అందడంలేదు. ఈ మేనేజర్లనుకునేవారు కొంతమంది యీ హాస్టల్సును తమ స్వప్రయోజనాల కుపయోగించుకుంటున్నారు. ఒకచోట వుండవలసిన యీ విద్యార్థులందరిని మూడిండ్లలో ఉంచుతున్నారు. 1958 వ సం. ఫిబ్రవరి నెలలో విద్యార్థులు మూడు రోజులు ఉపవాసాలుండవలసివచ్చింది. అధికారుల కీ విషయం తెలుపగా వారు వచ్చి తనిఖీ చేశారు. ఆ హాస్టలుకు గవర్నమెంటునుంచి రావలసినది 500 రూ. లు మాత్రమే అని తేలింది. కాని దానికి 1500 రూ. లు లెక్కల్లో తేడావచ్చింది. అంటేతక్కిన వెయ్యి రూపాయలు అతను తిన్నాడనుకోవాలి. దానిని అతడు నిర్వహించలేనని చెప్పినందువల్లనో, లేక ఇంకొక కారణంచేతనో అతడు రాజీనామా చేయడం జరిగింది. ఇటువంటి అక్రమాలు జరుగకుండా ఆహాస్టలును ప్రభుత్వం నడిపించవలెనని కోరుతున్నాను. హరిజనుల విషయంలో ప్రభుత్వం ఇంకా చర్య తీసుకుని వారికి కేటాయించిన డబ్బును సక్రమంగా వినియోగించేటట్లు శ్రద్ధతీసుకోవలెనని కోరుతున్నాను.

[13th March, 1958

శ్రీ డి. నరసయ్య:— అధ్యక్షా! మా యల్లందు, పాల్వంచ, బూర్గంపాడు తాలూకాలు చాలా వెనుకబడిన తాలూకాలు. కోయవారు ఎక్కువగాఉండే కొండప్రాంతాలివి. గిరిజన, హరిజన జాతులకు చెందిన ప్రజలు యీ ప్రాంతములలో చాలా ఎక్కువగా ఉన్నారు. ఈ సంవత్సరము వర్షములు లేక పంటలు పండనందువల్ల ప్రజలు తినుటకు తిండిలేక కట్ట బట్టలేక, ఎన్నో అవస్థలు పాలవుతున్నారు. ఇట్టి పేద ప్రజలకు ప్రభుత్వం ఏమీ సహాయంచేసినట్లు కనపడ లేదు. మా ప్రాంతములలో చౌకడిపోలు ఏర్పాటు చేయమని కలెక్టరుగారికి పిటిషనులు పంపుకున్నాము. ఐతే గోధుమలు మాత్రమే సరఫరాచేయగలమని వారు జవాబిచ్చారు. మా ప్రాంతం ప్రజలు గోధుమల కలవాటుపడ్డవారుకారు. మామీద ప్రభుత్వానికి దయలేకపోతే పేదప్రజలందరూ ఏమైపోవాలి? మా ప్రాంతములలో పటేలు పట్వారీలు చాలా అన్యాయాలు చేస్తున్నారు. అడవి బంజర్లుకూడ మాకు సాగుకు దొరకనివ్వడంలేదు. ఏదో సోషల్ వెల్ ఫేరు డిపార్టుమెంటు అని ఏర్పాటు చేశామన్నారు. దీనివల్ల మన కున్నంత ప్రయోజనం కలుగడంలేదు. నైజాము పరిపాలన పోయినతర్వాత ప్రభుత్వం మనది, మనది అనుకున్నామే కాని మా పట్ల తగినంత శ్రద్ధ చూపించడంలేదని ప్రభుత్వానికి తెలియచేస్తున్నాను. తెల్ల దొరల కాలంలో 25,30 మంది కోయవారిని ఉపాధ్యాయులుగా ఏర్పాటుచేశారు. కాని యీ నాడు ఒక టీచరుకూడలేదు. ఈ నాడు కోయలు చాలా యిబ్బందులకు గురవుతున్నారు. జాగీరుదార్ల, ఇజారాదార్ల, బంజరుదార్ల, మీద చర్యతీసుకోవాలి. వీరివల్ల మాకు చాలా అన్యాయం జరుగుతున్నది. పోరంబోకు, గట్టు నెంబరు, భూములకు యీనాటికి కూడ పట్టాలు ఇవ్వడంలేదు. ఈ కారణంవల్ల అన్యాక్రాంతాలు జరుగుతున్నాయి. కష్టపడి శ్రమచేసి కోయవారు డబ్బు సంపాదించుకుంటే దానిని కోర్టుల చుట్టు తిరిగి ఖర్చుపెట్టవలసిన పరిస్థితి యీనా డేర్పడింది. కోయవారు అక్రమాలకు గురికాకుండా చూడవలెనని ప్రభుత్వాన్ని ప్రార్థిస్తున్నాను. మా ప్రాంతములలో రహదారి సౌకర్యా లెక్కువచేయాలి. నా నియోజకవర్గం చాలా పెద్దది. మా కాన్ స్టిట్యుయన్సిలో శ్రీ సంజీవయ్యగారు ఒక పర్యాయం పర్యటనచేశారు. మా పరిస్థితులెలా ఉంటాయో చూడవలెనని రెండు రోజులు ఆ ప్రాంతంలో పర్యటింపవలెనని వారిని మేము కోరాము. కాని అప్పుడు వీలులేదని, తరువాత వస్తామని వారు చెప్పారు. మా ప్రజలయొక్క అష్టకష్టాలను వారు గమనిస్తే బాగుంటుంది. అడవి ప్రాంతాల్లో పెద్ద పులులు మొదలయిన క్రూర జంతువులమధ్య కొండగుహలలో మా ప్రజలు ఎట్టి దైన్య స్థితిలో జీవయాత్ర చేస్తున్నారో తెలుసుకుంటే బాగుంటుంది. వారు మా స్థితిగతులను దయతో పరిశీలిస్తారని, మాకు సౌకర్యాలు కలుగచేస్తారని ఆశిస్తున్నాను. ఈ సంవత్సరం పదిహేనుమంది ఉపాధ్యాయులయినా మా ప్రాంతంలో ఏర్పాటు

చేయించమని కోరుతున్నాను. మా ప్రాంతాలలో కోయలు, ఎరుకలు, ఏనాదులు బైరాగులు మొదలయినవారు ఎక్కువగా ఉన్నారు. వారికి జీవనాధారములు లేవు. ఈ సంవత్సరం వర్షాలు లేనందువల్ల, పంటలుపండక ప్రజలు చాలా ఇక్కట్లు పాలవుతున్నారు. గ్రామాల్లో బావులులేవు. మంచినీటి సౌకర్యాలు లేవు. ఉన్నచెరువులు పూడిపోయి మరమ్మత్తులు లేకుండా ఉన్నవి. ఇదివరలో కమ్యూనిస్టుపార్టీవారు పెట్టినబాధలకు మా కోయప్రజలు గురికావలసివచ్చింది. కాంగ్రెసు ప్రభుత్వకాలంలో కూడ వారికి యీ యిబ్బందులు తప్పడంలేదు. అందువల్ల ఏ పార్టీవారయినప్పటికి తమకు ఉపయోగంలేదని వారు బాధపడుతున్నారు. గ్రామాల్లోనికి వెళ్లుటకే సిగ్గుగాఉంది. ఓట్లడగడానికి మా ప్రాంతాలకు వస్తారు, తర్వాత మాకుసౌకర్యాలుచేయరు, మాయిబ్బందులు చూడరని మాకోయప్రజలు మమ్మలను నిందిస్తున్నారు. ముఖ్యమంత్రిగారయినా ఒకమారు మాప్రాంతాలకు వచ్చి మా ప్రజల యిబ్బందులను తొలగిస్తారని ఆశిస్తున్నాను. కొన్ని గుంటలకు గట్లుతెగిపోయి నీరు నిలవడంలేదు. ఆ గండ్లు మరమ్మత్తు చేయించవలెనని కోరుతున్నాను. మా ప్రాంతాలలో రహదారి సౌకర్యములు బొత్తిగాలేవు. బూరుగుంపాడునుంచి కొత్తగూడెంవరకు రోడ్డు వేయించాలి. యల్లందునుంచి మానుకోటవరకు రోడ్డు వేయించాలి. బూరుగుంపాడువద్ద వంతెనకట్టించాలి. ఈ వంతెన లేనందువల్ల వర్షాకాలంలో ప్రజలు చాలా ఇబ్బందిపడుతున్నారు. మా పేద ప్రజలు అన్నివిషయములలోను యీ ప్రభుత్వంమీదనే ఆధారపడ్డారు. అందువల్ల మమ్మలను ఇప్పటికయినా దయవుంచి కాపాడవలెనని కోరుతున్నాను.

శ్రీ పి. గున్నయ్య :—అధ్యక్షా ! మాజీమంత్రులకు సీనియర్ యం. యల్. ఎ. లకు పది నిముషాల సమయమయినా ఇప్పించినట్లయితే బాగుంటుంది.

మిస్టర్ స్పీకరు:—ఉపోద్ఘాతాలకు కాలాన్ని వ్యయంచేయడం మంచిదికాదు. శ్రీ పెద్దన్న గారిప్పుడు ఉపన్యశిస్తారు.

శ్రీ ఎన్. పెద్దన్న (ఖమ్మం - రిజర్వుడు):- అధ్యక్షా ! మంత్రిగారు యీ హరిజన సంక్షేమ డిమాండును ప్రవేశపెట్టుతూ చేసిన ప్రసంగం వింటూంటే శనగకాయ తిన్న కడపు ఎంత బాధ పడుతుందో అంతకంటే బాధగా ఉంటోంది. హరిజన సంక్షేమము కొరకు రెండున్నర కోట్లు ఖర్చు పెడుతున్నామని మంత్రిగారు తమ ప్రసంగంలో చెప్పారు. కాని దానికి యింకా రెండున్నర కోట్లు కలిపి మొత్తము అయిదు కోట్లు ఖర్చుపెట్టి నప్పటికీ హరిజనాభి వృద్ధి కాదు. అవుతుందని నాకు నమ్మకంలేదు. ఈ ఖర్చు సద్వినియోగంగా జరుగదు, దుర్వినియోగం అవుతోంది. ఇంతకుముందు ఏ ప్రభుత్వము కూడా సద్వినియోగం చేయలేదు. ఈ జాతిని అభివృద్ధికి తీసుకురాలేదు. ఈ ప్రభుత్వముకూడా దీనిని సద్వినియోగంచేసి,

[13th March 1958

హరిజన జాతిని అభివృద్ధికి తీసువస్తుందని నమ్మకంలేదు. ఈ 5 న్నర కోట్లు ఖర్చు పెట్టకుండా ఉంటే యితరత్రా పన్నులు తగ్గుతాయని, అందువల్ల యీ ఖర్చు అనవసరమని నా అభిప్రాయము. రైతుల వద్ద పన్నులు వసూలు చేసి హరిజనాభివృద్ధి పేర అనేక రకాలుగా కాజేయడం జరుగుతోంది. ఈ జాతి ఎందుకు అభివృద్ధిలోకి రావటం లేదంటే, వారందరినీ ఒక మురాగా చేర్చి హరిజనవాడల పేరుతో ఒకే చోట ఉంచుతున్నారు. వీళ్లు ఒకే చోట ఉంటే ఎప్పుడు కావాలంటే అప్పుడు అంతా ఒక చోట దొరుకుతారు, వేరే వేరే అక్కడక్కడా ఉంచినట్లయితే అందరూ ఒకసారి దొరకరని, అందరినీ ఒకే చోట ఉంచేట్లు చేశారు. మూమెంట్ రోజులలో, గర్నమెంటు దెబ్బలు కొట్టే టైములో పల్లెటూళ్లు అయిదారు కలిపి ఒకేచోట వీరందరినీ చేర్చేవారు. లేకపోతే దొరకరని భయము. మూమెంటు రోజులలో తన్నటానికి హంగుగా కావాలని ఆ విధంగా చేశారు. ఆ విధంగా యిప్పటికీ ఒకేచోట ఉంచినట్లయితే వారి అలవాట్లు వదులుకొని అభివృద్ధి చెందలేదు. నాగరికత అలవడదు. ఈ హైదరాబాదులో మా బ్రిదర్సు అనేక మంది ఉన్నారు. మా గూడెములలో ఉన్నప్పుడు ఎంత హీనముగా ఉన్నా, బయటకు పోయి చదువుకొని చాలా అభివృద్ధి చెందినారు. వీళ్ళే గూడెములోనే ఉండియున్నట్లయితే చదువు వచ్చేది కాదు. కాబట్టి ఈ జాతిని గూడెములలోనే ఉంచితే ఎన్ని కోట్లు ఖర్చు పెట్టినా అభివృద్ధి కారని ఘంటాపథంగా చెబుతున్నాను. అక్కడక్కడ గవర్నమెంటు కొన్ని లక్షలు ఖర్చుపెట్టి కాలనీస్ కట్టుతోంది. ఆ పద్ధతివల్ల కూడా ఏమీ మార్పు ఉండదు. కాలనీ ఆనే పేరులో మళ్ళీ అందరినీ ఒకేచోట ఉంచటం సంభవిస్తోంది. గూడెమునకు దీనికి ఏమీ భేదము ఉండదు. సిమెంట్ రోడ్లు వేసినా, ఇండ్లలో విద్యుచ్ఛక్తి దీపాలు పెట్టినా అభివృద్ధి కాజాలదు. కావలసినది విద్య, కాస్త భూమి. ఆర్థిక స్వాతంత్ర్యం కావాలంటే నాలుగెకరాల భూమి కావాలి. నైతిక స్వాతంత్ర్యం కావాలంటే విద్య కావాలి. కుటుంబములోని సాంప్రదాయాలు మారాలి. లేకపోతే ఎన్ని ఎకరాలు యిచ్చినా మారలేము. ఏదో నాల్గవ క్లాసు వరకూ చదువుకున్నా మళ్లీ గొడ్డు కాయటానికే వెళ్తారు. కాబట్టి యీ గూడెము లనేవి లేకుండా ఎక్కడ ఖాళీ ఉంటే అక్కడ విడి విడి ప్రదేశముల లోనే కట్టించండి. ఇతరుల అలవాట్లు నేర్చుకుంటేనే యీ జాతి అభివృద్ధిచెందుతుంది. మా బ్రదరుకు డోర్నకల్ రైల్వేలో ఉద్యోగము. మా ఇంట్లో ఉన్నంత వరకు అతనిలో ఏమీ మార్పు రాలేదు. ఇప్పుడు ఇల్లు వదలిపెట్టి పోయిన తరువాత మేము తినే మాంసముకూడా తినడు. మేము అంటే అసహ్యించుకుంటాడు. మాఇండ్లకు రాడు అంత అభివృద్ధి అయ్యాడు. కాబట్టి కీలక స్థానము ఎక్కడ ఉన్నదంటే, గూడెములను చీల్చి, సాధ్యమైనంతవరకు వాళ్ళకు ఇళ్ళు వేరువేరుగా మిగతా ప్రజల మధ్య కట్టించుట అవసరం. అప్పుడు అలవాట్లు మారతాయి. మా

ఖమ్మంనుంచి బెజవాడకు పోయి పది సంవత్సరాలు ఉన్నవాళ్ళు అక్కడి మాటలు నేర్చుకున్నారు-అలాగు, ఇలాగు; ఉదయం, సాయంత్రం-యీ మాటలు అలవాటయ్యాయి. అటువైపునుంచి ఖమ్మం వచ్చి ఉన్నవారికి యిక్కడి మాటలు అలవాటయినాయి. మంత్రివర్గంనుంచి క్రిందివరకూకూడా-హైదరాబాదు వచ్చి సంవత్సరము కాలేదు-గాంధీ దుస్తుల పద్ధతి వదిలిపెట్టి జిన్నా టోపీలు తగిలించుకుంటున్నారు. నెహ్రూ లాల్చీలు తీసేసి నిజామ్ నవాబుగారి సేర్వాణీలు వేసుకుంటున్నారు. అదే విధంగా పరిసర ప్రాంతాల అలవాట్లు తేలికగా వస్తాయి. ఒకళ్ళతో ఒకళ్ళు కలిసిపోయి అభివృద్ధి కావటానికి అవకాశాలు ఏర్పడుతాయి.

ఇంకొక విషయం-హరిజనుల సంక్షేమదృష్ట్యా సహాయం చేస్తామంటున్నారు. ఒక ఉదాహరణ యిస్తాను. దానిని గురించి మంత్రిగారుకూడా ఎంక్వైరీ చేయాలని కోరుతున్నాను. ఖమ్మంలో చెప్పులు పనులు చేసుకునేవారు 6 గురు కలిసి, గవర్నమెంట్ సోషల్ వెల్‌ఫేర్ డిపార్టుమెంటువారు సహాయం చేస్తారని దరఖాస్తు పెట్టుకున్నారు. ఇల్లెందులో ఆఫీసు ఉన్నది. అక్కడకు వెళ్ళి రావటానికి వారికి రు. 40 లు ఖర్చు అయినది. మనిషికి ఆరేసి రూపాయలు వేసుకొని నాలుగుసార్లు తిరిగితే వాళ్ళకు యిచ్చినవి యివి:—నీరుకు ఒక బొచ్చె రు.2-8-0, మేకులు గుంజుకునే కారు రు. 1-8-0, ఇంకొక కారు రు. 1-8-0, పంచ్ రు. 5, కోయడానికి రెంచ్ రు. 2-8-0, మేకుల పొట్లం రు. 1-8-0—మొత్తం 16 రూపాయలయినది. కాబట్టి ఎంత లాభం చేస్తున్నదో అర్థము చేసుకోవాలి. ఇందులో పనిచేసేవారికి సరిగా తిండిలేక దీర్ఘకాల వ్యాధులకు—టి.బి., కాన్సర్, రొమాటిజమ్—యిటువంటివాటికి గురి అవుతున్నారు. సోషల్ వెల్‌ఫేరు శాఖనుంచి ధన సహాయం దొరుకుతుందని 18 మందిచేత దరఖాస్తులు పెట్టించాము. ముందు యిద్దరికి సహాయం చేశారు. రు. 50 ల నగదు, రు. 50 ల మందులు సహాయంచేశారు.

ఆ 18 మందిలో ఒకరికి కలరా తగిలితే అతనిని యీ సంవత్సరం జనవరి 15 వ తేదీన హాస్పటల్‌కు తీసుకువెళ్లగా 3 రు. లు ఇంజక్షన్ అవుతుంది ఇచ్చుకో మన్నాడు అక్కడ డాక్టరు. హరిజనులకు ప్రభుత్వం ఏవిధంగా సహాయం చేస్తోందో దీనినిబట్టి అర్థం చేసుకోవలసి ఉన్నది. 18 మందిలో టి. బి. పేషంట్స్ ఇద్దరు చనిపోయారు. కాబట్టి హరిజనులను ఒక ప్రత్యేక తెగగా ఉంచవద్దు. మేము ప్రత్యేక తెగగా ఉన్నంతవరకు బాగుపడము......

**శ్రీ వి. రామారావు :** అధ్యక్ష మహాశయా! మనరాష్ట్ర సాంఘికసేవా మంత్రి సమర్పించిన బడ్జెటు డిమాండ్లను నేను ఆమోదిస్తూ, ఆ శాఖలో ఉన్నటువంటి అవకతవకలను తెలియజేస్తున్నాను. హరిజన, గిరిజన, వెనుకబడిన జాతుల,

విమోచనజనులు—ఈ నాలుగు వర్గాలకు రూ. 2,39,16,000 ఇస్తున్నామన్నారు. వారి సంఖ్యకూడ అంతే ఉన్నదని నేను అనుకొంటున్నాను. అంటే ఒక మనిషికి సంవత్సరానికి ఒకరూపాయి, ఖర్చు పెట్టబడుచున్నది అన్నమాట. అంటే వీరి ఉద్ధరణకొరకు ఖర్చుపెట్టబడుతున్న ఒక రూపాయి, బూడిదలో పోసిన పన్నీరువలె పాడైపోతున్నది, అని నేను అనుకొంటున్నాను. ఈ పడిపోయినటువంటి జాతులు దేశానికి వెన్నెముక అయి ఉన్నప్పుడు, దేశం అంతా వీళ్లమీద ఆధారపడి ఉన్నప్పుడు, వీళ్లకొరకు కొన్ని కోట్లరూపాయలు ఎక్కువ ఖర్చుపెట్టవలసి ఉంది. అంతేగాని, ఈ కొద్దిడబ్బుతోనే వారికి అభివృద్ధి కలుగజేయగలమని నేను అనుకోవటం లేదు. మంత్రిగారు మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత తెలంగాణాలో హాస్టల్స్ ఎక్కువగా పెట్టబడ్డాయన్నారు. తెలంగాణాలో 60, 70, హాస్టల్స్ వరకు ఉన్నాయన్నారు. ఇంతకుపూర్వం నేను హాస్టల్స్ కమిటీ మెంబరుగా ఉన్నాను. నాకు జిల్లాలలోని విషయాలు బాగా తెలుసును. మంత్రిగారు చెప్పింది సరైనది కాదని నేను అనుకొంటున్నాను. తెలంగాణాలో 9 జిల్లాలు ఉన్నాయి. నిజామాబాద్ జిల్లాలో కామారెడ్డి తాలూకాలో మాత్రం ఒక హాస్టల్ ఉంది. హైదరాబాదు జిల్లాలోని ఒక తాలుకాలో ఒక హాస్టల్ ఉంది. ఈ విధంగా ఒక్కొక్క జిల్లాకు రెండు మూడు హాస్టల్స్ మాత్రమే ఉన్నాయి. కాని మొత్తం తొమ్మిది జిల్లాలలో పదెనిమిది హాస్టల్స్ ఉన్నట్లయితే, ఇప్పుడు మంత్రిగారు చెప్పిన లెక్క సరిపోతుంది. కాని ఇప్పుడు ఒక్కొక్క జిల్లాలో రెండుమూడు హాస్టల్స్ ఉన్నప్పుడు 60, 70 హాస్టల్స్ తెలంగాణాలో ఉన్నాయని మంత్రిగారు ఏ లెక్క ప్రకారం యీ హవుస్‌కు అందజేశారో నాకు తెలియదు. సోషల్ సర్వీసు డిపార్టుమెంటుకు బడ్జెటులో కేటాయించిన డబ్బు ఏవిధంగా ఉపయోగించబడుతున్నది? ఎన్ని బావులు నిర్మించబడ్డాయి? ఎన్ని గృహాలు నిర్మించబడ్డాయి! ఆ డిపార్టుమెంటుకు కేటాయించిన డబ్బు ఇంకా ఏ ఏ పనులకు ఖర్చుపెట్టారు? ఆ యొక్క డిటెయిల్డు రిపోర్టును యీ హవుస్‌కు అందజేయలేదు. కాబట్టి, తాలూకా లెవెల్‌లో, జిల్లా లెవెల్‌లో, సోషల్ వెల్ఫేర్ డిపార్టుమెంటు, తనకు కేటాయించిన డబ్బు ఏ ఏ పనులకు ఖర్చుపెడుతోందో, ఆ వివరాలన్నీ, ఆ లెక్కలన్నీ యీ శాసన సభ్యులకు అందజేసినట్లయితే, వారు చేస్తున్న పనులు పూర్తిగా యీ హవుస్‌కు తెలుస్తాయి.

అస్పృశ్యతను తొలగించటానికి, మన దేశంలో ఎంతమంది త్యాగాలు చేసినప్పటికీ అది తొలగటంలేదు. అస్పృశ్యతను తొలగించుటకు మన భారత ప్రభుత్వం కొన్ని కోట్ల రూపాయలు ఖర్చుపెడుతున్నది. కాని ఏమీ లాభం లేకుండా ఉంది. ఈ అస్పృశ్యత పోవాలంటే, ఆత్మపరివర్తన రావాలని ఇదివరకు మన మంత్రిగారు సెలవిచ్చారు. ఆత్మపరివర్తన రావాలంటే, అస్పృశ్యత తొలగాలంటే, గొప్ప

13th March, 1958]

రివల్యూషన్ రావాలని నేను భావిస్తున్నాను. ఇది నా యొక్క భావన మాత్రమే కాదు. బాపూ జగజీవన్‌రామ్ మొన్న గ్వాలియర్ కాన్‌ఫరెన్స్‌లో ఏమన్నాడు? 1952 లో సికిందాబాదు కాన్‌ఫరెన్స్‌లో ఏమన్నాడు? 1953 లో నాగపూర్ కాన్‌ఫరెన్స్‌లో ఏమన్నాడు? 1954 లో సికింద్రాబాదు కాన్‌ఫరెన్స్‌లో ఏమన్నాడు? ఈనాడు సెంట్రల్ కేబినెట్ మినిష్టర్‌గా ఉన్నటువంటి, హరిజనజాతితో సంబంధం కలిగి ఉన్నటువంటి, హరిజనుల అనుభవాలను ప్రత్యక్షంగా చూస్తువున్నటువంటి జగజీవన్‌రామ్‌గారు ఏమన్నారో గమనించాలి. డాక్టరు అంబేద్కర్ తన జీవిత కాలంలో యీ హిందూ మతం హరిజన జాతికి చేసిన గొప్ప నష్టం ప్లాట్‌ఫారమ్స్ మీద ఉపన్యాసాల ద్వారా, గ్రంథాలలో వ్రాయటం ద్వారా ప్రజలకు తెలియ జెప్పాడు. గాంధీజీ Hinduism is a poison which spoiled the Country! అన్నారు. కాబట్టి యీ అంటరానితనాన్ని, మతమే చేసెనో లేక మనుజులే చేశారో దూరమనగ సుఖము దూరమాయె; ఇంక దూరమన్న హిందుమతం సున్నా" అని ఫార్మర్ డిప్యూటీ మినిష్టర్, ది గ్రేట్ తెలంగాణా హరిజన లీడర్ శ్రీ అరిగె రామస్వామి అన్నాడు. ఈ జాతి మొత్తంగా బాగుపడాలంటే, అస్పృశ్యతా నివారణ కావాలి. దీనిని గురించి ప్రభుత్వం ఒక చట్టం చేసినా, అది యీనాడు ఆచరణలో లేదు. హరిజనులు ఎవరైనా తమ హక్కులు అడుగుతూంటే, వారిని బహిష్కరిస్తున్నారు. చాకలి, మంగలి, కమ్మరి, కుమ్మరి, ఎరుకల జాతులన్నీ ఏకమై యీ హరిజనులను అణగబెడతారు, అంటరానితనం పోయినపుడే, హరిజనులు ఇతర జాతులతో సమానం అవుతారు. హరిజనులు ఇతర జాతులతో సమానంగా తయారైన తర్వాతనే, మొత్తము దేశము బాగుపడుతుంది. కాబట్టి సోదరులారా (నవ్వు) క్షమించండి; అధ్యక్షా, గాంధీజీ "Harijan cause is live fire, the more ghee you pour in it the more it requires" అని అన్నారు. హరిజనులను ఉద్ధరించాలంటే హరిజనులకు ఎక్కువ సేవచేయండి. ఇక్కడ కూర్చున్న శాసన సభ్యులందరు — వారు కాంగ్రెసు పార్టీవారైనా, సోషలిస్టు పార్టీవారైనా, కమ్యూనిస్టు పార్టీవారైనా — హిందువులే కదా. నిజంగా హరిజన జాతిని వాళ్లంతా అణగద్రొక్కుతున్నారు. వీళ్లే శాసనాలు తయారు చేస్తున్నారు. కాని, ఆ శాసనాలను ఆచరణలో పెడుతున్నారా అంటే లేదు. గాంధీజీ హరిజన బాల బాలికలను తన ఇంటిలో పెట్టుకొని హరిజన జాతిలో లీనమై పోయాడు. ఇక్కడ సభ్యులు కూడ అలా చేస్తున్నారా అంటే లేదు. నాకు యీ అవకాశం ఇచ్చినందుకు అధ్యక్షులకు ధన్యవాదాలు తెలియజేస్తూ ముగిస్తున్నాను.

[13th March, 1958

శ్రీ జి. రాములు:- అధ్యక్షా, నేడు గౌరవనీయులైన సంక్షేమ శాఖా మాత్యులు, సంజీవయ్యగారు అనుసూచిత జాతుల అభివృద్ధికి కావలసిన డబ్బును, దానికి సంబంధించిన డిమాండ్లను ప్రవేశపెట్టారు. వారు మా హరిజన తరగతికి చెందిన వారు. అగ్రజాతుల మంత్రులలో మా హరిజనులైన సంజీవయ్య గారు కూడ ఒక మంత్రిగా ఉన్నారు. అందుకు నేను సంతోషిస్తున్నాను. కాని ఈ అనుసూచిత జాతులకు ఉద్ధరించుటకు వారు ఏమీ చేయలేదని, వారు తమ అధికారాన్ని సద్వినియోగ పర్చటంలేదని తెలియజేస్తున్నాను.

ఇప్పుడు నేను ఒక ఉదాహరణ చెబుతున్నాను. ఒక కఱ్ఱముక్క తెచ్చి, ఒక ఇనుప ముక్కకు సొరకొట్టి పెట్టినట్లయితే దానియొక్క పూర్వగాధను మరచి పోయి ఆ చెట్లను ఏ విధముగ క్రింద పడగొట్టుకున్నదో అదేమాదిరిగ మా మంత్రి గారి యొక్క అధికారము ఉన్నది. ఆ విధముగ అధికారము సద్వినియోగము చేయలేనిచో వెంటనే రాజీనామా ఇవ్వాలని వారికి నేను మనవి చేస్తు న్నాను. మన దేశమునకు స్వతంత్రము వచ్చి యిప్పటికి పది సంవత్సరములు కావచ్చింది. మొదటి పంచవర్ష ప్రణాళిక మాటలలో పూర్తి చేసుకున్నాము. ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో ఈదులాడుచున్నాము. మా ప్రాంతాలలో నివ సిస్తున్న అనుసూచితజాతులయొక్క యిబ్బందులు వాళ్లనుఅంటుకుని బాధిస్తున్నవి. వారి యొక్క క్షామమును గుర్తించి ప్రభుత్వము ఏలాంటి సదుపాయము కలుగ చేయడము లేదు. ఆ ప్రాంతాలలో క్షామం పెరిగిపోయింది. హరిజనులకు, మాల మాదిగలకు తినటానికి తిండి, కట్టటానికి బట్ట, ఉండటానికి ఇల్లు దొరకటము లేదు. అస్పృశ్యత అసలేపోలేదు. ఈ రోజున యీ లాంటి పరిస్థితులు దేశములో నివారించబడకుండా ఉన్నందుకు ప్రభుత్వము సిగ్గుపడవలసి ఉన్నది. ఒక్కొక్క గ్రామములో చూస్తే, ఒక్కొక్క యింటిలో పదేసి కుటుంబాలు ఉంటున్నవి. పొయ్యిదగ్గర ఒక కుటుంబము, దొడ్లో ఒక కుటుంబము, తడిక చాటున ఒక కుటుంబము, యీ విధముగ కిక్కిరిసి, ఇళ్లలో నివసించుచూ పిల్లలను కంటూ సంసారములు గడుపుకుంటున్నారు. వారి యొక్క దుస్థితిని ప్రభుత్వం ఆలోచిం చడము లేదు. ఇక మన నాయకులందరు రాష్ట్రములో పర్యటించటానికి పోయినప్పుడు వినాయకులుగ వేషాలు మోజుగాదంచి వేదికలు ఎక్కి, హరిజను లను రక్షిస్తామని చెప్పి డాబుసరిగా ఉపన్యాసాలు దంచేస్తారు. వేదికలుదిగి ఇంటికి రాగానే గడపకూడా దాటకు అంటారు యీ మహానాయకులు. ఇలాంటి పరి పాలన డాబుసరులకేనా ? కాకపోతే హరిజనులకు మేలు చేసేది ఏమైనా ఉన్నదా? అధ్యక్షా ! నేను యింకా ఎన్నో విషయములు మీదృష్టికి తేదలచుకున్నాను. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము ఏర్పడి యిప్పటికి రెండు సంవత్సరములు కావచ్చింది. నా యొక్క జన్మస్థానము మంథెన. ఆ తాలూకా ఆ ప్రాంతములో కనుకనూరు,

13th March, 1958]

మూకనూరు, నీలంపల్లివగైరా గ్రామాలు ఉన్నవి. మంత్రులైన మన నాయకులు ఆ ప్రాంతాలకు ఎప్పుడైనా పర్యటనకుపోయి ఉన్నారోలేదో నాకు అనుమానము. వారు బహుశః పోయి ఉండరు. పోరుకూడ. ఎందుకంటే అక్కడ రోడ్లు లేవు. రోడ్లు ఉన్నంతవరకు మాత్రమే మంత్రులు పోయి వస్తారు. ఆ ప్రాంతాలకు మంత్రులు దౌరాలు పోయినా, వారు సామంత రాజులుగానే తయారౌతారు. ఎందుకంటే అక్కడ రోడ్లు లేవు. బండ్లలో ప్రయాణము చేయవలసి ఉంటుంది. అయితే నేను ఒక్క విషయము ప్రభుత్వదృష్టికి తేదలచుకున్నాను. మంత్రులు కార్లలో తప్ప మరేవిధముగాను పర్యటించరు. ఆ ప్రాంతాలకుపోతే, వారికి ఉన్న అపురూప శరీరములకు హానికలుగుతుందేమోనని భయపడి పోనేపోరు. అయితే మంత్రులు బత్తాలు రూపములో ఎంతోధనమును పుచ్చుకుంటున్నారు. ఆ ప్రాంతాలలో అనుసూచిత జాతులవారు ఎట్లా నివసిస్తున్నారో మంత్రులు చూచి ఉండరు.

మిస్టర్ స్పీకర్:-అది అంతా అనకండి. పోనటువంటి చోట్లకు పోయినట్లు వారు వ్రాసుకోరు. అట్లా మాట్లాడకూడదు.

**శ్రీ జి. రాములు:**—రోడ్లు ఉన్నచోట్లకేకాకుండా, రోడ్లు లేనటువంటిచోట్లకు గూడ మంత్రులు పోవలసి ఉంటుంది. అక్కడి జను లందరు వీరికి ఓట్లు వేసినందువల్లనే వీరందరు యిక్కడ మంత్రులయ్యే అవకాశము ఏర్పడినది. మేమంతా శాసనసభ్యులుగా వచ్చింది వాళ్ళు ఓట్లు వేసినందువల్లనే గనుక వారియొక్క క్షేమములుకూడ చూడవలసిన బాధ్యత ప్రభుత్వముమీద ఉన్నది. మంథెన చుట్టు ప్రక్కన ప్రాంతములో అడవులు ఉన్నవి. అక్కడ కొండజాతులవారు నివసిస్తున్నారు. వాళ్ళకు తిను ఆహార ధాన్యాలు దొరకవు. ఆకు, అలము, గడ్డలు తిని బ్రతుకుచున్నారు. కాని మంత్రులు తినేది సన్నని బియ్యము, మంచి మంచి శాఖాహారములు చేయించుకుని తింటారు. ఇక పర్యటనకు వస్తే, విందులు తప్ప మరేమిలేదు. సౌఖ్యముగ విందులు ఆరగించుకొని వెళ్ళిపోతారు. ఇలాంటి మంత్రులు ఆ కొండజాతివాళ్ళ స్థితిగతులుకూడ విచారించి వస్తే, సంతోషించేవాళ్ళము. మంత్రులు ఆ వైపునకే తిరిగి చూడరు. మంత్రులు ఎప్పుడుచూచినా కార్లలో వైభవమును అనుభవించి వస్తూ ఉంటారు. అడవిజాతులు తినే గడ్డలపై కూడ ప్రభుత్వం పన్ను తీసుకుంటున్నది.

**శ్రీ డి. సంజీవయ్య:**—అయితే గౌరవ సభ్యులు ఏ గడ్డలు తింటున్నారు?

**శ్రీ జి. రాములు:**—మేము తినేవి ఏమిటో కావాలంటే చెబుతాను.

**శ్రీ ఆర్. నారాయణ రెడ్డి:**-గౌరవ సభ్యులు తినేవి ఉర్లగడ్డలు, **Cabage** వగైరాలు.

శ్రీ డి. సంజీవయ్య:-ఆ మాట ఒప్పుకుంటే సంతోషమే.

శ్రీ జి. రాములు:- ఆ అడవులలో మంచి నీరు దొరకదు. ఆకు, అలముపడి మురిగిన మురికి నీటినే త్రాగుతున్నారు. వేరే మంచినీటి సదుపాయాలు లేవు. అలాంటి మురికినీరు త్రాగుటవల్ల వాపు రోగములు, కీళ్ళ రోగములు వచ్చి వారి శరీరములో జబ్బు ఏర్పడి వాండ్ల రూపములు వికృత ఆకారములుగా మారిపోతున్నవి. ఇక వైద్య సౌకర్యాలు బొత్తిగా లేదు. ఈ నీరు త్రాగుటవల్లనే వాళ్ళకు కీళ్ళ జ్వరములు, మలేరియా జ్వరములు వచ్చి, వికృతరూపులై జీవిస్తున్నారు. ప్రభుత్వము వాళ్ళకు ఏమైనా వైద్య సౌకర్యాలు కలుగజేసినారా అని అడుగుచున్నాను. అధ్యక్షులవారు టైము అయిందని అంటున్నారు గనుక ఇంతటితో ముగిస్తున్నాను.

శ్రీ వి. కూర్మయ్య:— అధ్యక్షా! మాల, మాదిగల యొక్క గోడు భాగవతమా, భారతమా అని కీ॥ శే॥ మంగిపూడి వెంకటశర్మగారు ఇదివరకే చెప్పారు. ఇప్పుడు హరిజనులను గురించి చాలా మంది సభ్యులు మాట్లాడారు. హరిజనుల యొక్క అవస్థలను గురించి చెప్పారు. కాని అవి తీర్చటానికి ప్రభుత్వం ప్రయత్నించడము సాధ్యము కానిపని. మామూలుగా మన బడ్జటు సమయములో వారి యొక్క కష్టములు చెప్పడము, వాటిని నివారిస్తామని మంత్రిగారు చెప్పడము అలవాటు అయిపోయింది. కాని నాకు చాలా విచారకరముగ ఉన్నదల్లా ఏమిటంటే, ఇప్పుడు మనకు opposite గా కూర్చున్న పెద్దన్నగారు, పెద్ద నరసయ్యగారు కూడ మాట్లాడారు. బహుశ హరిజనులన్నా, గిరిజనులన్నా వారికి తెలిసి ఉండదు. వారు యువకులు, అందువల్ల హరిజనులకొరకు ఎంతమంది నాయకులు, ఎంత కష్టములు, ఎంత బాధపడి యున్నారో, ఎంతెంత త్యాగాలు చేశారో, అవి అన్నీ కూడ చరిత్రను ఒకసారి తిరగవేసి చూస్తే, ఆ విధముగ మంత్రిగారిని అని ఉండరు. మంత్రిగారు ఏమైనా చేయకపోతే నిజముగ వారిని నిందించవలసిందే. కాని ఆ విధముగ వారిని నిందించ కూడదు. గౌరవ సభ్యులకు ఏ మాత్రము అనుభవము లేదని నా అభిప్రాయము. హరిజనోద్ధరణ కొరకు ఎంతో మంది Reformers యీ దేశములో పుట్టియున్నారు. రామానుజాచార్యులు దగ్గరనుంచి, శంకరాచార్యులు దగ్గర నుంచి, మధ్వాచార్యులు దగ్గరనుంచి అస్పృశ్యత నివారణ కొరకు practical గా గాంధీగారి నిర్యాణము జరిగేటంతవరకు గట్టి ప్రయత్నాలు చేశారు. ఆ విషయము మన కందరికీ తెలుసు. అది మరచిపోలేము. మహాత్మాగాంధీగారు మనకు బోధించిన సిద్ధాంతాల వల్లనే, మనలో ఇంతమంది యీ సభకు రాగలిగాము. ఇది అంతా గాంధీగారి భిక్ష అని మాత్రము మనము గ్రహించాలి. మన కళా వెంకటరావుగారు కూడ హరిజనుల విషయము చెప్పారు. వారితో నేను ఏకీభవిస్తున్నాను. ఏనాటికైనా కాంగ్రెసు ప్రభుత్వం పరిపాలనలో

ఉండినన్నాళ్లే, దేశములో హరిజనోద్ధరణ అనేది ఉండగలుగుతుంది కాని, మరే కమ్యూనిస్టు పార్టీయో, సోషలిస్టు పార్టీయో, పరిపాలనకు వస్తే, హరిజనుల నామరూపాలు కూడ లేకుండాపోతారేమోనని మాత్రము నాకుఅనుమానముగ ఉన్నది. అంతవరకు సందేహము లేదని చెప్పగలను కాంగ్రెసు పార్టీ తప్ప మరే యితర పార్టీ అయినా అధికారములోనికివస్తే, హరిజనుల నందరినీకూడ లేబరుతో కలిపి వారియొక్క భవిష్యత్తుకు భంగము కలుగజేస్తారని అనేక Conferences లో అందరు అభిప్రాయము వెలిబుచ్చుచునే ఉన్నారు. గాంధీగారు హరిజనోద్ధరణ కొరకు చేసిన కృషి మనము ఎవ్వరము మరువలేము. ఈ హరిజన డిమాండు మీద ఒక కోటి యాభై లక్షలు ఖర్చుచేస్తున్నారు. ముఖ్యంగా మద్రాసు రాష్ట్రములో గాని, ఆంధ్ర ప్రదేశ్‌లోగాని హరిజనోద్ధరణ విషయములో ఇతర States లో కంటే డబ్బు వ్యయము చేయడములో అయితే నేమి, వారి Conscience create చేయడములో అయితే నేమి, వారికి విద్యా బుద్ధులు నేర్పడములో అయితే నేమి మన ఆంధ్ర ప్రదేశ్, మద్రాసు రాష్ట్రములు ముందడుగు వేస్తున్నవనే చెప్పవచ్చు. ఈ విషయము All-India Harijan Sevak Sangh యొక్క రిపోర్టులో కూడ నమోదు చేయబడింది. అందువల్ల హరిజనులకు ఎంతవరకు సహాయపడవలసి ఉంటుందనే విషయము తెలుసుకోవాలి. మన సంజీవయ్యగారు నిద్రపోతున్నారని కొంత మంది సభ్యులు విమర్శించారు. నిజానికి వారు హరిజనుల విషయమై నిద్రపోవడమే కాదు. ఇతర మెంబర్లు నిద్రపోతున్నారని నా అభిప్రాయము. మెంబర్లు ఊరకనే కబుర్లు చెబుతూన్నారని నేను అనుకుంటూనే ఉన్నాను. కళా వెంకట రావుగారు, గోపాలరెడ్డిగారు చెప్పిన మాటలు నిజమే. అది మేము పబ్లికుగా ఒప్పుకోవలసిందే. మంత్రివర్గములో హరిజనులకు ప్రాతినిధ్యము ఇవ్వాలని మన India Constitution లో ఎక్కడనూలేదు. కాని వెనుక శ్రీమాన్ రాజగోపాల చారిగారు మద్రాసు రాష్ట్రములో ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడు, గాంధీగారి సలహా వల్లనే హరిజనులకు మంత్రివర్గములో ప్రాతినిధ్యము యివ్వడము జరిగింది. లేకపోతే హరిజనోద్ధరణకు దారి ఉండదు అని ఉద్దేశించి అది ఒక convention గా ఏర్పాటు చేశారు. ఆనాటి నుంచి యీనాటి వరకు ప్రతి మంత్రివర్గములోనూ ఒక మంత్రి పదవి హరిజనులకు యిస్తూ వస్తున్నారు. అందువల్లనే హరిజనుల పేరు మరవకుండా బండి సాగిపోనిస్తున్నారు. ఈ ప్రాతినిధ్యమును గురించి ఆనాడు కాంగ్రెసు హైకమాండు వారు కూడ ఆదేశించారు. అయితే మంత్రి వర్గములో హరిజన మంత్రులు ఒకరా, ఇద్దరా అని అంటే, అది వారి వారికి ఉన్న బలము మీద ఆధారపడి ఉన్నది. వేమయ్యగారు చెప్పిన అన్ని విషయాలలోనూ నేను వారితో ఏకీభవిస్తున్నానుగాని, ఒక్క విషయములో మాత్రము నేను వారితో ఏకీభవించలేక పోతున్నాను. హాస్టల్సు విషయములో డబ్బు దుబారా జరుగుతున్న

దని వేమయ్యగారు అన్నారు. ఈ విషయములోనే నేను వారితో ఏకీభవించడము లేదు. వారి పార్టీలోని వారిని ఎవరైనా ఒక్కరు లేచి చెప్పమనండి? గత అయిదు సంవత్సరములలో ప్రభుత్వము పెట్టిన హాస్టలు ఏదైనావారిలో ఒకరైనానడిపినారా అని అడుగుతున్నాను.- రాజగోపాలాచారిగారు ముఖ్యమంత్రిగా ఉన్నప్పుడుకూడ కమ్యూనిస్టు పార్టీ వారు యీ హాస్టళ్ల మేనేజమెంటును గురించి విమర్శిస్తూనే వచ్చారు. కమ్యూనిస్టు పార్టీ వారు ఒక్కరైనా management చేశారా?

శ్రీ యన్. వేమయ్య :- On a Point of order, Sir, నేను కూడ కొన్నాళ్ళు హాస్టలును మేనేజిమెంటుచేసి వదిలి వేశానండి.-హాస్టళ్ల సంగతి నాకు బాగా తెలుసు.

*SRI V. KURMAYYA :* I am not yielding Sir.

వేమయ్యగారు చెప్పబోయే విషయము నాకు తెలుసు. కాబట్టి మేము మేనేజి చేయగలిగాము. కాని విమర్శించేవారిని ఎవరినైనా సరే manage చేయ మనండి. ప్రతి M. L. A. ను ఒక హాస్టల్ కు in-charge గా ఉంచి మేనేజిచేయ మంటే, అప్పుడు అందులో ఉన్న కష్టము బోధపడుతుంది. హాస్టల్ మేనేజిమెంటు అంటే ఎంత కష్టమో, చేసేవారికి తెలుస్తుందిగాని దూరముగ ఉన్నవారికి తెలి యదు. దూరముగ ఉండి ఎంతైనా విమర్శించవచ్చు. ఏదో హాస్టల్సులో దుబారా జరుగుతున్నదని కేకలు వేస్తే కాదు. దుబారా అనేది, ఎక్కడ జరగడములేదు? P. W. D. లో జరగడములేదా? నేను మినిష్టరుగా ఉన్నప్పుడు నా భార్య హాస్ట లును మేనేజిమెంటు చేసేది. హాస్టలులో ప్యూన్ పని దగ్గరనుంచి, గుమాస్తాపని వరకు అన్నీ ఆమె నిర్వహించేది. పిల్లలకు అన్నము వండిపెట్టేది. అన్ని పనులు ఆమే చేసేది. దుబారా అంటే అందులో అర్థము లేదు. మహా తింటే, ఎవరైనా ఏ నాలుగు, అయిదు, పది రూపాయలు తింటే తినవచ్చుగాని, వేలు, లక్షలు ఏ విధముగ దుబారాచేసి తినగలరు? ఎక్కువ తినటానికి వీలుకాదు. 5% మార్జిను ఉండవచ్చు. ప్రభుత్వంయొక్క హాస్టల్సు నూటికి 40 వంతులు వారి జీతాలకు పోతుంది. లెక్కలు తీసుకుని చూస్తే బోధపడుతుంది. ప్రభుత్వం హాస్టలు అయితే రూ. 22-8-0 లు, ప్రైవేటు మేనేజిమెంటుక్రింద ఉండే హాస్టలు అయితే రూ. 15-8-0 లు అవుతుందని అంటున్నాను. అయితే Warden కు, Peon కు, Cook కు జీతాలు మంత్రిగారు చేర్చలేదు. మంత్రిగారు ఒక్కసారి యీ విష యము పరిశీలించి నిజానిజములు గురించి సమాధానము చెప్పవలెనని కోరుతు న్నాను. ఇవి అన్నీ గాంధీగారియొక్క సిద్ధాంతముక్రింద ఏర్పడిన సంస్థలే.

వెల్ ఫేర్ సొసైటీ లన్నీ ప్రజలే నిర్వహించుకోవాలి. ప్రజలలో తప్పు వుంటే-ప్రజలంతట ప్రజలే దిద్దుకోవాలి. మనమంతా మానవులం కనుక తప్పులు

13th March, 1958]

చేయడం సహజం. సంజీవయ్యగారు క్రమపద్ధతిలోనే వ్యవహారాన్ని సాగిస్తు న్నారు నేను వారితో పూర్తిగా ఏకీభవిస్తున్నాను.

అస్పృశ్యతా నివారణ చట్టం, దేవాలయ ప్రవేశ చట్టం-మున్నగువాటిని మనం పాస్ చేశాము. వాటిని తప్పకుండా అమలు చేయాలని గట్టిగా చెబుతు న్నాను. ప్రతి జనవరి 30 వ తేదీన ప్రతి ఊరిలోనూ హరిజనులు దేవాలయప్రవేశం చేయాలనేది ఆ చట్టంయొక్క అభిప్రాయం, కాని సరిగా అమలు జరగడంలేదు. ఏదో ఒకటి, రెండు తాలూకాలలో, జిల్లాలలోనే జరుగుతున్నది. అట్లా కాకుండా ప్రతి గ్రామంలోనూ గ్రామ కరణాల, మున్సబుల, ప్రభుత్వ పాఠశాలల ఉపా ధ్యాయుల ఆధ్వర్యాన; కాంగ్రెసు, కమ్యూనిస్టుల ఆధ్వర్యాన-ప్రతి జనవరి 30వ తేదీన ఆంధ్రప్రదేశ్ అంతా అమలు జరిపి, త్వరగా అస్పృశ్యతా నిర్మూలనము గావించాలని కోరుతూ, అధ్యక్షులవారికి కృతజ్ఞత తెలుపుతూ నేను విరమిస్తు న్నాను.

**శ్రీ డి. సంజీవయ్య :** అధ్యక్షా! ఈపద్దుపై చర్చలో 16 మంది సభ్యులు పాల్గొన్నారు. ఇది చాలా శుభసూచకమైన సంఖ్య. వీరిలో ఆఖరున మాట్లాడిన శ్రీ కూర్మయ్యగారు "హరిజనుల విషయమై కొంతమంది శాసన సభ్యులకు బాగా అర్థంకాలేదు" అన్నారు. అది వారు అనుభవపూర్వకంగా చెప్పిన విషయ మని నేను భావిస్తున్నాను. హరిజనులగోడు భారతముతోనో, భాగవతముతోనో పోల్చవచ్చునని వారు చెప్పారు. కాని అది భారతముతోను, భాగవతముతోనూ పోల్చదగినది కాదు. రామాయణంతో పోల్చడానికి అవకాశంగల చరిత్ర అది. ఆనాడు, దేశంలో దుర్మార్గం పెరిగి, అశాంతి ఏర్పడినప్పుడు, ఆ దుర్మార్గాన్ని, అశాంతిని అరికట్టి దేశంలో ప్రశాంతవాతావరణం కలుగజేయడానికి, దేశంలో నివసించే ప్రజానీకానికి సౌకర్యాలు ఏర్పాటుచేసి, సుఖప్రదంగా జీవించేందుకు అవకాశాలు కల్పించేందుకు భగవంతుడే రామావతారం ఎత్తివచ్చి తగిన కార్య క్రమాన్ని జరిపించారు. ఈనాడు, భారతదేశంలో సాంఘికంగా కొన్ని జాతులకు అన్యాయం జరుగుతున్నప్పుడు, అట్టి అన్యాయాన్ని అరికట్టి, సాంఘిక న్యాయాన్ని చేకూర్చడానికి, భగవంతుడు మహాత్మాగాంధీ అవతారం ఎత్తి వచ్చారని నేనను కొంటున్నాను. కాబట్టి, హరిజన సమస్య రామాయణంతో పోల్చబడడానికి అవకాశం కలిగినట్టిదని మనవి చేస్తున్నాను- మహాత్మాగాంధీ భారతజాతి పిత. వారు మహోత్కృష్టమైన ఆశయాలతో పనిచేశారు. వారు యీదేశంలో ఉండి ఉండక పోయినట్లయితే ఈనాడు హరిజనులు శాసనసభలలో గాని, పార్లమెంటు లోగాని, కూర్చొనడానికి ఆస్కారం ఉండేదికాదు. ఈనాడు హరిజనులకు సౌక ర్యాలు కలుగజేయబడుతున్నాయంటే, కాంగ్రెసు ప్రభుత్వాలు, కాంగ్రెసు

సంస్థలు అట్టి సౌకర్యాలు కలుగచేస్తున్నాయంటె — అది మహాత్మా గాంధీకి శిష్యులైనవారు, గాంధీజీకి ఆత్మీయమైన కార్యాన్ని చేస్తున్నారు. మహాత్మా గాంధీ మీద ఉండే గౌరవభావంవలననే యీ పని జరుగుతున్నది గాని ఇతరత్రా జరగడం లేదనే విషయాన్ని కూర్మయ్యగారు స్పష్టపరిచారు. వారు ప్రతిపక్ష సభ్యులను challenge చేసినట్లుగా అడిగినారు. ఈనాడే కాదు, 1953 వ సం॥లో ఆంధ్ర అసెంబ్లీలో 40 మంది కమ్యూనిస్టు సభ్యులున్న సభలో—వారు కూర్చుని అదేపనిగా విమర్శచేసిన మీదట—నేను అదేవిధంగా సమాధానం చెప్పాను. నేను అట్టి సమాధానం చెప్పినతరువాత కమ్యూనిస్టులు పలుకకుండా, పళ్లైయినా విప్ప కుండా ఉన్న సంగతి మరొక్కసారి జ్ఞాపకం చేస్తున్నాను.

ఈ నాడు మళ్లా, Hostels గురించి విమర్శ చేస్తున్నారు. హాస్టలు మేనే జరులు దురన్యాయాలు చేస్తున్నారని, దొంగతనాలు, దోపిడీలూ చేస్తున్నారని బీద విద్యార్థుల కోసం యిచ్చిన ధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారనీ, వారి స్వార్థం కోసం వినియోగించు కొంటున్నారనీ, విద్యార్థులకు సరైన వసతులు కల్పించడంలేదని కమ్యూనిస్టులు విమర్శనలు చేస్తున్నారు. అయితే కమ్యూనిస్టు పార్టీ తరపున ఒక్క హాస్టలైనా నడిపించినారా?

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:— ప్రభుత్వంవారు grant ఇస్తే నడిపించడానికి మేము సిద్ధంగా ఉన్నాము.

శ్రీ డి. సంజీవయ్య:— తప్పకుండా ఇస్తాము. హాస్టలును బాగా ఆదర్శ ప్రాయంగా నడిపించి, దోపిడీ లేకుండా, దొంగతనం లేకుండా, అన్యాయం లేకుండా నడిపించి "ఇదిగో కమ్యూనిస్టుపార్టీ తరపున మేము ఏర్పాటుచేసి నడపు తున్న హాస్టలు ఎంత బాగా నడుస్తున్నదో చూడండి, కాంగ్రెసువారు, ఇతర సంఘ సేవాపరాయణులుకూడా యీ విధంగా నడపండి" అని చెబితే బాగుంటుందిగాని, అసలు హాస్టలు నడపడంలో ఉండే సాధక బాధకాలను ఇబ్బందులనూ అర్థంచేసుకో కుండా, అవగాహన చేసుకోకుండా విమర్శనా పూర్వకంగా ఉపన్యాసాలుచేస్తే ఏమి లాభంలేదు. నేను ఇదివరకు యీ విషయమే చెబుతూ ఒకపద్యం చెప్పినాను. ఇప్పుడు మరొక్కసారి జ్ఞాపకం చేస్తున్నాను.

"ఉత్తఉరుమును, మెరపె శరత్తునందు
ఉరుమకయె కురువానతరి ఘనుండు,
కూయునేగాని కుజనుండు చేయబోడు,
చేయునేగాని సుజనుండు చెప్పబోడు"

ఈ నాడు కూడా వారు దీనికి సమాధానం చెప్పటలేదు. చెప్పగలిగే పరిస్థితిలోలేరు.

13th March, 1958]

[Sri S. Vemayya rose in his seat]

*SRI D. SANJIVAYYA :* I am not yielding Sir. It is not a point of order.

మిస్టరు స్పీకరు:- సభ్యుల నెవ్వరినీ interrupt చేయనీయను. పార్టీ నాయకులు ఏదైనా చెబుతానంటే consider చేయబడుతుంది. కాని ఇతర సభ్యులు ఎవ్వరూ లేచి మాట్లాడుటకు ప్రయత్నిస్తే నేను allow చేయను.

శ్రీ డి. సంజీవయ్య:— Hostels సక్రమంగా నడుపబడుతున్నవనే నా అభిప్రాయం. 400 హాస్టల్లున్నాయి. 400 మంది మేనేజరులచేత నిర్వహింపబడే సందర్భాలలో ఎక్కడైనా ఒకటి, రెండుచోట్ల పొరపాట్లు జరిగివుండవచ్చునేమో!

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:- కాంగ్రెసువారు ఎన్ని హాస్టలులు నడుపుతున్నారు?

శ్రీ డి. సంజీయ్య :- నూటికి 90 హాస్టళ్లను ప్రభుత్వంవారే నడుపుతున్నారు.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:- ప్రభుత్వంవార నడిపే హాస్టల్స్ అన్నీ తామే నడుపుతున్నామని కాంగ్రెసువారు అనుకుంటున్నారా ?

శ్రీ డి. సంజీవయ్య :—ప్రభుత్వంవారు నడిపే హాస్టల్సుసంఖ్య 22 మాత్రమే. ఆంధ్రప్రదేశలో మొత్తం సుమారు 400 హాస్టల్సున్నాయి. అందులో 56 తెలంగాణా ప్రాంతంలో ఉన్నాయి. వాటిలో నూటికి 99.9 కూడా కాంగ్రెసువారిచేతనే నడుపబడుతున్నాయి. వారే సేవ చేస్తున్నారు, వారే వారిజనులను రక్షించడానికి సిద్ధంగా ఉన్నారు.

శ్రీ ఆర్. నారాయణరెడ్డి:—ప్రభుత్వం ఎంత grant ఇస్తున్నదో—దయచేసి సంఖ్య చెప్పండి.

శ్రీ డి. సంజీవయ్య:— ఒక హాస్టలులో 100 మంది విద్యార్థులు వుంటే 50 మందికి మాత్రమే నెలకు 15 రూ. లు ఇస్తున్నారు. ఒక విద్యార్థికి నెలకు 15 రూ. ల చొప్పున యిస్తే పూటకు ఎంత అవుతుందో లెక్కవేసుకోమని చెబుతున్నాను. అయితే, మిగిలిన 50 మంది విద్యార్థులు ఎలా పోషింపబడుతున్నారో ఆలోచించమని ప్రతిపక్షీయులకు మనవి చేస్తున్నాను. ఈ నాడు యీ పనులు చేస్తున్నారంటే—బిక్షం ఎత్తో, దయాదాక్షిణ్యాలు కలిగిన, సుస్వభావం కలిగిన ధనాఢ్యులను ఆశ్రయించో—చేయ కలుగుతున్నారు.

శ్రీ బద్దం ఎల్లారెడ్డి (బుగ్గారం):— ఆ విధంగా కొద్దిమందికి మాత్రమే చేయ

[13th March, 1958

గలుగుతారు గాని, గ్రామసీమల్లో ఉన్న లక్షలాది ప్రజలకు చేయలేరు. అదికూడా ప్రభుత్వ బాధ్యతయని గుర్తించారా ?

*MR. SPEAKER :* Let the hon. Member resume his seat.

రావి నారాయణ రెడ్డిగారు మాట్లాడినారంటే — వారు పార్టీ తరఫున మాట్లాడినారు. మంత్రిగారు serious గా జవాబు చెప్పారు. ఇక అందరినీ allow చేయను.

**శ్రీ డి. సంజీవయ్య:**—ఇప్పుడుకూడా నేను—challenge చేసి చెబుతున్నాను. జూన్ నెలలో కళాశాలలూ, పాఠశాలలూ తెరవబడతాయి. కనీసం ఒక గ్రామంలో హాస్టలు నడిపించడానికి ప్రయత్నించండని చెబుతున్నాను. కాని, అట్లా నడిపించకుండా—హరిజన వాడలలోనికి వెళ్లి, "మాది హరిజనుల కోసం సృష్టింపబడిన పార్టీ, మాది బీదల పార్టీ, మీగుడిసెలలోనే ఉంటాము, మీతోనే తింటాము అని ప్రచారంచేసుకోవడం, మొసలికన్నీరు కార్చడం తప్ప ఒక్క చోటైనా కార్యరూపేణా చేసిన పాపాన పోలేదు. అందువల్ల, ఇకనైనా మాటలు కట్టిపెట్టి కృషిచేయాలి. తీపి మాటలచేత మధురమైన వాక్యాలచేత ముగ్ధులను చేయడమే గాని మంత్రిగారు ఏమీచేయడం లేదంటున్నారు. వారు మాటలు మాట్లాడుతున్నారే కాని ఒక పనిఅయినా చేయలేదుకదా ! నేను చేసిన పనుల నెన్నింటిని చెప్పను ? అందువల్ల యీ నాడు, మాటలు కట్టిపెట్టి, కార్యరూపేణాచేసి, అది కూడా ఆదర్శప్రాయంగాచేసి, ఎవరైనా పొరపాటు చేస్తున్నట్లయితే యీవిధంగా దిద్దుకోండి అని చెప్పడం మంచిది, సబబు, సముచితమైన విషయమని నేను స్పష్టం చేస్తున్నాను.

శ్రీ బి. రామారెడ్డిగారు మాట్లాడుతూ "తెలంగాణాలో హాస్టల్సు పెట్టినామని మంత్రిగారంటున్నారు, ఆయనకు యీ లెక్కలు ఎక్కడనుంచి వచ్చాయి, ఇదంతా అబద్ధం, ఎన్ని హాస్టల్సున్నాయో నాకేతెలుసు" అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. మరి, వారెక్కడనుంచి సంపాదించినారో ఆ information నాకు తెలియదు. అయితే, నేను వారి వలననే Information పొందాలా, లేక దానికోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన డిపార్టుమెంటు, ఉద్యోగులచేత information తెప్పించుకోవాలా? ఇక జిల్లావారీగా తెలంగాణాలో యీ సంవత్సరం కొత్తగా ఏర్పాటు చేయబడిన హాస్టల్సు సంఖ్య చెబుతాను.

| జిల్లా | | హాస్టలుల సంఖ్య |
|---|---|---|
| (1) హైదరాబాదు | ... | 2 |
| (2) కరీంనగర్ | ... | 1 |

13th March, 1958]

| | | |
|---|---|---|
| (3) మహబూబ్‌నగర్ | ... | 2 |
| (4) నల్లగొండ | ... | 15 |
| (5) నిజామాబాదు | ... | 2 |
| (6) వరంగల్ | ... | 4 |
| | మొత్తం | 26 |

ఇవి అధికార పూర్వకంగా ఉద్యోగులచేత సేకరింపబడిన లెక్కలు. వీటిని ఎక్కడ ఏర్పాటు చేశారో, అర్థం చేసుకోకుండా, కనీసం తెల్సుకోడానికైనా ప్రయత్నించకుండా యిటువంటి అర్థరహితమైన విమర్శలు చేయడం భావ్యం కాదని వినయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

జిల్లా లెవెలులో ఎంత ఖర్చుఅవుతున్నదో, ఏమిటో తెలియడం లేదన్నారు. ఈ విషయమై ప్రభుత్వం యిప్పటికి కొన్ని సంప్రదింపులు జరిపినవి. కలక్టరులను అడిగినది. జిల్లా స్థాయిలో కొన్ని కమిటీల నేర్పాటు చేయాలను కొంటున్నాము. అక్కడ వుండే హరిజన, వెనుకబడిన తరగతులకు చెందిన సభ్యులు, ఇంకా యితర సంఘ సేవా పరాయణులు—కలిగిన ఒక కమిటీని ఏర్పాటు చేస్తే బాగుంటుం దను కొంటున్నాము. ఆ కమిటీకి కలక్టరుగారే Chairman గా ఉంటారు. ఆ కమిటీవారే నెలకొక పర్యాయమో, రెండు నెలల కొక పర్యాయమో సమా వేశం జరుపు కొన్నట్లయితే జిల్లా స్థాయిలో ఏ యే item క్రింద ఎంత ఖర్చు అయినదో, ఇంకా ఎంత మొత్తం కేటాయించాలో తెలుస్తుంది, అనుభవం గలిగిన వారు పలుప్రాంతాలలో పర్యటించి ఏ యే ప్రాంతాలలో ఎటువంటి ఇబ్బందు లున్నాయో తెలియపరుస్తారు. జిల్లా స్థాయిలో ఇటువంటి కార్యక్రమాన్ని రూపొందించడానికి అవకాశం ఉంటుందనుకొంటున్నాను. ఆ కమిటీలు త్వరలోనే ఏర్పడతాయి. వాటిలో యీ శాసన సభ్యులకు కూడా అవకాశం ఉంటుందని మనవి చేస్తున్నాను.

తరువాత అస్పృస్యత గురించి వారు కొంత చెప్పినారు. "ఇంత దూరం అన్న హిందూ మతం సున్న" అని ఎవరో చెప్పినారు. సంపూర్ణముగా ఆ పద్య మును నేర్చుకొని ఉంటే నేను సంతోషించే వాడిని. ''ఇంత దూరమన్న హిందూ మతం సున్న పరమ భక్తి కామ అరిగె రామ" అని ఉండేది. ఆ పరమ భక్తుని మరచిపోయారే అని నాకు చాలాదుఃఖముగా ఉన్నది. ఆపద్యం వ్రాసి సంఘంలో ఉన్న కుళ్ళును తొలగించుటకు ప్రయత్నంచేసి, ఆ మకుటమును వ్రాసిన వారిని మరచిపోయారే అని నాకు విచారముగా ఉన్నది.

[13th March, 1958

గలుగుతారు గాని, గ్రామసీమల్లో ఉన్న లక్షలాది ప్రజలకు చేయలేరు. అదికూడా ప్రభుత్వ బాధ్యతయని గుర్తించారా ?

*MR. SPEAKER :* Let the hon. Member resume his seat.

రావి నారాయణ రెడ్డిగారు మాట్లాడినారంటే — వారు పార్టి తరఫున మాట్లాడినారు. మంత్రిగారు serious గా జవాబు చెప్పారు. ఇక అందరినీ allow చేయను.

**శ్రీ డి. సంజీవయ్య:**—ఇప్పుడుకూడా నేను—challenge చేసి చెబుతున్నాను. జూన్ నెలలో కళాశాలలూ, పాఠశాలలూ తెరవబడతాయి. కనీసం ఒక గ్రామంలో హాస్టలు నడిపించడానికి ప్రయత్నించండని చెబుతున్నాను. కాని, అట్లా నడిపించకుండా—హరిజన వాడలలోనికి వెళ్లి, "మాది హరిజనుల కోసం సృష్టింప బడిన పార్టీ, మాది బీదల పార్టీ, మీగుడిసెలలోనే ఉంటాము, మీతోనే తింటాము అని ప్రచారంచేసుకోవడం, మొసలికన్నీరు కార్చడం తప్ప ఒక్క చోటైనా కార్యరూపేణా చేసిన పాపాన పోలేదు. అందువల్ల, ఇకనైనా మాటలు కట్టిపెట్టి కృషిచేయాలి. తీపి మాటలచేత మధురమైన వాక్యాలచేత ముగ్ధులను చేయడమే గాని మంత్రిగారు ఏమీచేయడం లేదంటున్నారు. వారు మాటలు మాట్లాడు తున్నారే కాని ఒక పనిఅయినా చేయలేదుకదా ! నేను చేసిన పనుల నెన్నింటిని చెప్పను ? అందువల్ల యీ నాడు, మాటలు కట్టిపెట్టి, కార్యరూపేణాచేసి, అది కూడా ఆదర్శప్రాయంగాచేసి, ఎవరైనా పొరపాటు చేస్తున్నట్లయితే యీవిధంగా దిద్దుకోండి అని చెప్పడం మంచిది, సబబు, సముచితమైన విషయమని నేను స్పష్టం చేస్తున్నాను.

శ్రీ బి. రామారెడ్డిగారు మాట్లాడుతూ "తెలంగాణాలో హాస్టల్సు పెట్టినా మని మంత్రిగారంటున్నారు, ఆయనకు యీ లెక్కలు ఎక్కడనుంచి వచ్చాయి, ఇదంతా అబద్ధం, ఎన్ని హాస్టల్సున్నాయో నాకేతెలుసు" అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చారు. మరి, వారెక్కడనుంచి సంపాదించినారో ఆ information నాకు తెలియదు. అయితే, నేను వారి వలననే Information పొందాలా, లేక దానికోసం ప్రత్యేకంగా ఏర్పాటు చేయబడిన డిపార్టుమెంటు, ఉద్యోగులచేత information తెప్పించుకోవాలా? ఇక జిల్లావారీగా తెలంగాణాలో యీ సంవత్స రం కొత్తగా ఏర్పాటు చేయబడిన హాస్టల్సు సంఖ్య చెబుతాను.

| జిల్లా | | హాస్టలుల సంఖ్య |
|---|---|---|
| (1) హైదరాబాదు | ... | 2 |
| (2) కరీంనగర్ | ... | 1 |

| | | |
|---|---|---|
| (3) మహబూబ్‌నగర్ | ... | 2 |
| (4) నల్లగొండ | ... | 15 |
| (5) నిజామాబాదు | ... | 2 |
| (6) వరంగల్ | ... | 4 |
| | మొత్తం | 26 |

ఇవి అధికార పూర్వకంగా ఉద్యోగులచేత సేకరింపబడిన లెక్కలు. వీటిని ఎక్కడ ఏర్పాటు చేశారో, అర్థం చేసుకోకుండా, కనీసం తెల్సుకోడానికైనా ప్రయత్నించకుండా యిటువంటి అర్థరహితమైన విమర్శలు చేయడం భావ్యం కాదని వినయపూర్వకంగా విజ్ఞప్తి చేస్తున్నాను.

జిల్లా లెవెలులో ఎంత ఖర్చుఅవుతున్నదో, ఏమిటో తెలియడం లేదన్నారు. ఈ విషయమై ప్రభుత్వం యిప్పటికి కొన్ని సంప్రదింపులు జరిపినవి. కలక్టరులను అడిగినది. జిల్లా స్థాయిలో కొన్ని కమిటీల నేర్పాటు చేయాలను కొంటున్నాము. అక్కడ వుండే హరిజన, వెనుకబడిన తరగతులకు చెందిన సభ్యులు, ఇంకా యితర సంఘ సేవా పరాయణులు—కలిగిన ఒక కమిటీని ఏర్పాటు చేస్తే బాగుంటుం దను కొంటున్నాము. ఆ కమిటీకి కలక్టరుగారే Chairman గా ఉంటారు. ఆ కమిటీవారే నెలకొక పర్యాయమో, రెండు నెలల కొక పర్యాయమో సమా వేశం జరుపు కొన్నట్లయితే జిల్లా స్థాయిలో ఏ యే item క్రింద ఎంత ఖర్చు అయినదో, ఇంకా ఎంత మొత్తం కేటాయించాలో తెలుస్తుంది, అనుభవం గలిగిన వారు పలుప్రాంతాలలో పర్యటించి ఏ యే ప్రాంతాలలో ఎటువంటి ఇబ్బందు లున్నాయో తెలియపరుస్తారు. జిల్లా స్థాయిలో ఇటువంటి కార్యక్రమాన్ని రూపొందించడానికి అవకాశం ఉంటుందనుకొంటున్నాను. ఆ కమిటీలు త్వరలోనే ఏర్పడతాయి. వాటిలో యీ శాసన సభ్యులకు కూడా అవకాశం ఉంటుందని మనవి చేస్తున్నాను.

తరువాత అస్పృశ్యత గురించి వారు కొంత చెప్పినారు. "ఇంత దూరం అన్న హిందూ మతం సున్న" అని ఎవరో చెప్పినారు. సంపూర్ణముగా ఆ పద్య ము నేర్చుకొని ఉంటే నేను సంతోషించే వాడిని. ''ఇంత దూరమన్న హిందూ మతం సున్న పరమ భక్తి కామ అరిగె రామ" అని ఉండేది. ఆ పరమ భక్తుని మరచిపోయారే అని నాకు చాలాదుఃఖముగా ఉన్నది. ఆపద్యం వ్రాసి సంఘంలో ఉన్న కుళ్ళును తొలగించుటకు ప్రయత్నంచేసి, ఆ మకుటమును వ్రాసిన వారిని మరచిపోయారే అని నాకు విచారముగా ఉన్నది.

[ 13th March, 1958

జి. రాములుగారు మాట్లాడుచూ మంత్రి రోడ్లమీద పోవుచున్నారే కాని పల్లెలకు పోవుటలేదని అన్నారు. నేను పర్యటన చేసిన గ్రామాలు ఏవో, వాటికి ఎలాంటి రోడ్లు ఉన్నవో కావలసినచో పూర్తి లెక్కలు యిచ్చుటకు సంసిద్ధంగా ఉన్నాను. నేను పర్యటించిన గ్రామాలలో నూటికి 50 పంతులుకు పైగా రోడ్లు లేని దారి డొంకలు లేని గ్రామాలకు పోయి ఉన్నచో ఆయన ఏమి చేయుదురో చెప్పమని అడుగుచున్నాను. అయన కాన్‌స్టిట్యూయన్సిలో ఎంత తిరుగుచున్నాడో తెలియదు.

తర్వాత మంత్రులు పర్యటన చేయకుండనే బత్తాలు పుచ్చుకొంటున్నారని అన్నారు. అది చాలా అన్యాయమైన ఆరోపణ. ఇంత బాధ్యతారహితమైన ప్రకటనను గౌరవ సభ్యులుగా వుండి అసెంబ్లీలో చేయడం మంచిది కాదని వారికి మనవి చేయుచున్నాను. ఇక ముందైనా పరిస్థితులను అవగాహన చేసుకొని మంచి ఉపన్యాసములు చేస్తారని ఆశిస్తున్నాను.

వైద్య సౌకర్యములు లేవని కథలు చెప్పినారు. కథల మీద ఆధారపడితే లాభం లేదు. ఈనాటి వాస్తవ పరిస్థితులను గ్రహించి వాటి దృష్ట్యా మన కార్యక్రమం రూపొందించుకొని కొంత సేవ చేయుటకు ప్రయత్నించాలి. పెద్దన్న, మలుసూరుగార్లు ఎంత సేపు మాట్లాడినా వారి నియోజకవర్గం గురించే మాట్లాడినారు. దొడ్డా నర్సయ్యగారు ఇల్లెందు ప్రాంతంలోని ప్రజల కష్టాల గురించి చెప్పినారు. నేను గూడ స్వయంగా చూచినాను. చెరువులకు మరమ్మత్తులు కావాలి. అంతే గాక టీచర్సును హెచ్చించాలని చెప్పినారు. ప్రభుత్వం ఆ ప్రయత్నంలోనే ఉన్నది. వారు అడిగిన విషయములను తప్పకుండ పరిశీలన చేసి ఆ కొండ ప్రాంతంలోని ఆ కోయ ప్రజలకు తగిన సహాయం చేస్తామని ప్రభుత్వం తరఫున వారికి హామీ ఇస్తున్నాను. కృష్ణావతారంగారు ఇంకా కొంత మంది సభ్యులు ఈ పద్దు క్రింద కేటాయించిన మొత్తం చాలా తక్కువని అన్నారు. ప్రభుత్వం బాగా యోచించి ఏ పద్దు మీద ఎంత కేటాయించుటకు అవకాశ మున్నదో ఆ విధముగా బడ్జెటును రూపొందించింది. హరిజన విద్యార్థులనుండి పరీక్ష ఫీజు వసూలు చేస్తున్నారని అన్నారు. ఇప్పుడు పరీక్ష ఫీజు తీసుకొనుట లేదు. కాని స్పెషల్ ఫీజు తీసుకొంటున్నారు. ఆ విషయంలో కూడ ఆలోచించి ప్రభుత్వం మార్పు చేయుటకు ప్రయత్నిస్తుంది.

తరువాత భూములపై పెనాల్టీస్ సంగతి అడిగినారు. రెవెన్యూ శాఖామాత్యులు ఆ విషయంగురించి ఆలోచించు చున్నారు. వారికి చేదోడు వాదోడుగా ఉండి ఆ విషయంలో త్వరలో తీర్మానం చేయుటను ప్రయత్నం చేస్తాను.

**Legal aid** ను గురించి అడిగినారు. ఇప్పుడు క్రిమినల్ కేసులకు మాత్రమే

ఇస్తున్నాము. Civil Cases విషయం అలోచనలో ఉన్నది. త్వరలోనే సహాయం లభించ గలదని అనుకొనుచున్నాను.

రుక్మిణమ్మగారు మంచి భాషలో చక్కని ఉపన్యాసం చేసినారు. అస్పృశ్యతా నివారణ సందర్భంలో దేవాలయ ప్రవేశ చట్టములు లేక Civil disabilities చట్టము, కేంద్రి ప్రభుత్వం చేసిన అన్‌టచబిలిటి అఫెన్సు చట్టం అమలు జరిగినంత మాత్రాన ఈ కార్యక్రమములో మీరు దిగ్విజయం పొందలేరు. అది one way traffic కాకుండ సవర్ణులలో పరివర్తన రావాలి. హరిజనులు గూడ వృద్ధిలోకి వచ్చి విద్యనేర్చుకొని శుచి, శుభ్రత కలిగి ఉండాలి. అప్పుడే ఈ అస్పృశ్యతా రాక్షసి నశించుటకు వీలుంటుందని ఆమె చెప్పినది అక్షరాలా నిజం. వెల్ ఫేర్ పాఠశాలలలోనే కాక ఇతర పాఠశాలలలో కూడ మధ్యాహ్న భోజనం పెట్టాలన్నారు. ఆ విషయం మేము ఆలోచన చేసినాము. ఇతర పాఠశాలలలో హెచ్చుగా సవర్ణ హిందువులు కూడ ఉంటారు. వారు చూస్తుండగా హరిజన పిల్లలకు భోజనం పెట్టడం బాగుండదనే ఉద్దేశంతో పెట్టడం లేదు.

శ్రీ ఆర్.బి. రామకృష్ణరాజు (వదమలపేట):-అధ్యక్షా ! పూర్తిగా హరిజన పిల్లలు ఉన్నచోట కూడ భోజన వసతి కల్పించ సాధ్యం కాదన్నారు. ఆ విషయం రెండుసార్లు మంత్రిగారి దృష్టికి తీసుక వచ్చాను. ఆ విషయమును గమనిస్తారా?

శ్రీ డి. సంజీవయ్య:- గమనిస్తాము.

ప్రాథమిక విద్యార్థులకు ఎందుకు ప్రవేశమిచ్చినారని చెప్పుచున్నారు. హరిజన హాస్టల్సును నడుపుచున్న వారంతా సరాసరి ఫస్టుఫారంకు మాకు విద్యార్థులు లభించరు. పల్లెలనుండి ఒక్కొక్కప్పుడు తల్లి దండ్రులకు మంచి సౌకర్యములున్నవని నచ్చచెప్పి 3 వ తరగతి, నాలుగవ తరగతి చదువు పిల్లలను తీసికొని హాస్టల్సులో పెట్టి వారిని క్రమేణ వృద్ధిచేయుటకు వీలు ఉంటుందని చెప్పడం జరిగింది. అటువంటి పరిస్థితులలో వెంటనే దానిని రద్దు చేయడం బాగుండదని చెప్పుచున్నాను.

మాట్రన్ విషయంలో నేను ఆర్డరు వేసికూడ దాదాపు రెండు మాసములు అయినది. ఇంకా రాలేదని వారు అంటున్నారు. వెంటనే మాట్రన్‌ను పంపుటకు ప్రయత్నంచేస్తాము.

ఆఫీసర్లు అటూ ఇటూ ఎక్కువగా తిరుగుతుంటారు. వారిమీద దుబారా ఖర్చు ఎక్కువగా అవుతున్నదని అన్నారు. మేము లెక్కలు వేసి చూచినా ఆఫీసర్లమీద అయ్యే ఖర్చు 9% కన్న అధికంగా లేదు.

[13th March, 1958

అంతయ్యగారు మాట్లాడుచూ సంగారెడ్డిలోని హాస్టలులో భోజనం చాలడం లేదు అని అన్నారు. ఒక్కొక్క పిల్లవానికి ప్రభుత్వం 15 రూ॥లు ఇస్తుంది. అది సబ్సిడైజ్డు హాస్టల్ అని జ్ఞాపకం ఉంచుకోవాలి. హాస్టలు కయ్యే ఖర్చునంతా భరిస్తామని ఎప్పుడు చెప్పలేదు. పిల్లలకు భోజనం చాలుటలేదు, కాబట్టి మేము నడప లేము అంటే ప్రభుత్వమే ఒక హాస్టలును ఏర్పాటుచేయుటకు సంసిద్ధంగా ఉన్నది.

అక్కడ ఒక వాగు ఉన్నది. హరిజనులు దాని ప్రక్కనే ఉండుటచే అప్పు డప్పుడు ప్రమాదములకు గురియగుచున్నారన్నారు. అందువల్లనే ఈనాడు గృహ వసతి ఏర్పరచే విషయంలో ఆఫీసర్లు priority fix చేసుకొని ఇవ్వమనిచెప్పినాము. ప్రమాదములకు గురిఅయ్యేవారికి ప్రథమ ప్రైయారిటీ ఇవ్వబడుతుంది.

తేనింగు సెంటర్సు, తంగెడు చెక్క విషయం రామలింగం, అంతయ్య గార్లు చెప్పినారు. కో ఆపరేటివ్ సంఘాలు ఏర్పాటుచేసుకొన్నచో వేలంపాట లేకుండ వారికే ఇవ్వబడుతుంది. కో ఆపరేటివ్ సంఘమును రిజిస్టరు చేసుకొనుటకు అయ్యే మొత్తమునుగూడ కట్ట నవసరం లేకుండ చేయమని వారు అడిగినారు. కాని ఒక్క దమ్మిడీ వేయకుండ "ఆ సంఘం, మునగనీ, తేలనీ నాకు బాధ్యత లేదు" అనే తత్వంలో సభ్యులు ఉన్నట్లైతే ఆ సంఘం ఎలా నడుస్తుంది? కాని కొన్ని సడలింపులు చేయుటకు ప్రయత్నం చేస్తున్నాము.

లచ్చన్నగారు మాట్లాడినారు. వారు కొంతకాలం ఈ శాఖను నిర్వహించి నారు. ప్రతి కాలేజీలోకూడ ఒక హాస్టలు ఉండాలన్నారు. కాలేజీలు ఉన్న ప్రతి చోట హాస్టల్సు ఉన్నవని అనుకొనుచున్నాను. హరిజన విద్యార్థుల హాస్టల్సుకు lumpsum grants కాకుండా individual grants మంచివని అన్నారు. హాస్టలు మేనేజర్లందరూ ఏకగ్రీవంగా ఒక తీర్మానం చేసి హరిజనుల శ్రేయస్సుకోసం మొత్తంగానే ఇవ్వండని కోరడం జరిగింది. అంతేగాక ఎన్నో సంవత్సరములు హరిజన సంక్షేమంకోసం కృషిచేసిన వి. కూర్మయ్య, బి. యస్. మూర్తి, యస్. నాగప్పలాంటి పెద్దలు ఈ individual Grants కూడదు, అది మా పద్ధతి కాదు అని ఏక కంఠంతో చెప్పినప్పుడు అన్యథా చేయడం భావ్యంకాదు. కాబట్టి జూన్ మాసంనుండి ఈ lumpsum grants పెట్టి, individual grants ను తీసివేస్తామని మనవిచేయుచున్నాను.

హౌసింగ్ విషయములో ఏవో అన్యాయములు జరిగాయని, కేంద్ర ప్రభు త్వముదగ్గర డబ్బు వున్నప్పటికి మనము ఏమీ ప్రయత్నం చేయటంలేదని వారు చెప్పారు. వారు మంత్రిగా ఉన్నప్పుడు ఎన్ని ఇండ్లు కట్టించారో, ఎన్ని గ్రాంటులు వున్నాయో నాకు తెలియదు. Low Income Group Scheme అని చెప్పారు. Low income group scheme కు అర్థం తెలిసివుంటే వారు ఆ విధంగా విమ

13th March, 1958]

ర్శించివుండేవారు కారు. ఆ విషయం గురించి కో ఆపరేటివ్ సొసైటి రిజిస్ట్రారుతో సంప్రదిస్తే వారు వీలులేదని చెప్పారు. రిపేయింగ్ కెపాసిటి, సెక్యూరిటి మొదలైనవి వుండాలని వారు చెప్పారు. రూరల్ హౌసెస్ గురించి ప్రయత్నించాలని ఆలోచిస్తున్నాము. గత సంవత్సరం Backward classes కు లక్ష రూపాయలు దుర్వినియోగం అయినదని చెప్పారు. స్కాలర్ షిప్స్‌గా మార్చామని చెప్పాము. Backward classes వారికి భవనాలకోసం సెంట్రల్ గవర్నమెంటు వారికి పథకాన్ని పంపిస్తే Backward classes housing scheme క్రిందనే ఇండ్లు ఏర్పాటు చేసేటప్పుడు 75% హరిజనులకు ఇవ్వాలని వారు చెప్పారు. ఆ ధనము దుర్వినియోగము కాలేదు అవకాశములు జారవిడువలేదని, భారత ప్రభుత్వముతో సంప్రదింపులు జరుపుతున్నామని వారికి గృహవసతి కల్పించటానికి ప్రయత్నాలు చేస్తూన్నామని మనవిచేస్తున్నాను. అంకెల సంగతి చెప్పారు. మామూలు బడ్జెటులో ప్రొవిజన్ వున్నప్పుడు కొంచెము ఎక్కువ ఖర్చు అయినప్పటికి రివైజ్డు ఎస్టిమేటు వేయవచ్చును. మొదటి సంవత్సరములో ఎక్కువ ఖర్చుపెడితే రెండవ సంవత్సరములో కొంత హెచ్చు ఖర్చుపెట్టవచ్చును. రెండవ సంవత్సరములో మరీ ఎక్కువ ఖర్చుపెడితే మూడవ సంవత్సరములో కొంత తక్కువ ఖర్చుపెట్టుతూ వుంటాము. ఏ విధముగానైనా మొత్తం 5 సంవత్సరాలలో ఖర్చుపెడతాము.

ఎరుకునాయుడుగారు సాలూరుగురించి మాట్లాడారు. సాలూరును ఏజన్సీగా పరిగణించటానికి, అక్కడ వున్న ఇబ్బందులను తొలగించటానికి ప్రయత్నిస్తాము. పండించినవాటికి అమ్మకపు సౌకర్యాలు కలుగజేయటానికి, మార్గాలను నిర్మించటానికి ప్రయత్నిస్తాము.

శ్రీమతి వాణీ రమణరావుగారు చాలా చక్కని సలహాల ఇచ్చారు. హాస్టల్స్ లేక చాలా బాధపడుతున్నారని, వారికి సహాయం చేయాలని, షైలాక్ వంటి వ్యాపారస్థు లిచ్చిన అప్పులబాధను తగ్గించటానికి ప్రయత్నించాలనిచెప్పారు. అప్పుల విషయమై ప్రభుత్వమువారు order ను ఇవ్వబోతున్నారు. ప్రెసిడెంట్ గారు ఆమోదించిన పిదప దానిని కేంద్ర ప్రభుత్వం తిరిగి పంపుతుంది. అది కొలది రోజులలోనే వస్తుందనుకొంటున్నాము. అది రాగానే అమలు జరుపుతాము. అభివృద్ధిచెందని ప్రాంతములలో N. E. S. బ్లాకులను, ఏర్పాటుచేస్తున్నారు. గిరిజనుల ప్రాంతములలో ఎందుకు ఏర్పాటుచేయటంలేదని వారు ప్రశ్నించారు. అరకు, పాడుకుంపేట మొదలైన నాల్గుచోట్ల మల్టిపర్పస్ బ్లాకులను ఏర్పాటు చేశాము. ఒక్కొక్క బ్లాకుకు 27 లక్షలను ఖర్చుపెడుతున్నాము. N. E. S. బ్లాకులకు మనం 12 లక్షలు ఖర్చుచేస్తుంటే 15లక్షలు కేంద్ర ప్రభుత్వం ఇస్తున్నది. ఆ ప్రాంతాలలో వుండే గిరిజనులు, కోయవారికోసం ఖర్చుచేస్తున్నాము. కొత్త

బ్లాకులు వచ్చినప్పుడు భద్రాచలం ఏజన్సీని దృష్టిలో పెట్టుకొంటాము. దొడ్డా నరసయ్యగారు బ్రిడ్జి విషయంగురించి చెప్పారు. దానిని గురించి ముఖ్యమంత్రి గారు చెప్పారు. కేంద్ర ప్రభుత్వం ఇచ్చినా, ఇవ్వకపోయినా మేము చేస్తాము. కాని కేంద్ర ప్రభుత్వ సహాయమును అర్థిస్తున్నాము. ఢిల్లీ వెళ్ళినప్పుడు దత్తార్ గారితోకూడా మాట్లాడినాను. "మధ్యభారత్‌లో నర్మదానదిపై ఇటువంటిదే నిర్మిస్తున్నాము, వాటికి స్పెషల్ గ్రాంటుగా ఇచ్చాము, తరువాత మీ ఆంధ్ర ప్రదేశ్‌లోనిది తీసుకొని భద్రాచలం బ్రిడ్జికి సహాయం చేస్తా" మని వారు నాకు చెప్పారు. మోబైల్ హాస్టల్ సంగతి చెప్పారు. కర్నూలుజిల్లాలో చెంచువారి కోసం ఒక మోబైల్ హాస్టల్ వుంది. ఇంకా కొన్ని ప్రాంతాలలో వున్నాయి. భద్రాచలం ఏరియాలోకూడా ఒక మోబైల్ హాస్టలుల్‌ను ఏర్పాటుచేయటానికి ప్రయత్నిస్తున్నాము.

ఏ జిల్లాలో ఏ బావులు కావాలో, ఎక్కడ పాఠశాలలు కావాలో మొత్తం ఆంధ్రప్రదేశ్ అంతటా సర్వేచేయించమని N. K. లింగంగారు చెప్పారు. ఎచ్చటికి వెళ్ళిన అక్కడ కావలసిన వాటిని ఆ ప్రజలే అడుగుతూవుంటారు. సర్వేచేయించ వలసిన అగత్యంలేదు. మనవద్ద వున్న శక్తినిబట్టి మనంచేస్తే బాగుంటుంది. హరిజన క్రైస్తవులకు విద్యా సౌకర్యాలు, హాస్టల్ సౌకర్యాలు కల్పించాలని చెప్పారు. ఆంధ్రలో కల్పిస్తున్నాము. తెలంగాణాలో హరిజన క్రైస్తవులకు కూడా ఆ సౌకర్యాన్ని కలుగచేయాలని ప్రయత్నముచేస్తున్నాము. Jeeps సప్లయి చేయాలనివారు చెప్పారు 1957-58 బడ్జెటులో ప్రావిజన్ వుంది. ప్లాన్ ప్రకారం సరఫరా చేయటానికి ప్రయత్నిస్తాము. ఒక గ్రామంలో ఎలక్ట్రిసిటి వున్న మాలపల్లెలోను, హరిజనులు వుండే ప్రదేశములలోను దీపాలు వేయటంలేదని లింగంగారు చెప్పారు. అన్ని చోట్ల వేయమని మేము ఉత్తర్వులు ఇచ్చాము. నందికొట్కూర్ నియోజక వర్గములోనివారు కొంతమంది నా వద్దకు వచ్చి హరిజన వీధులలో కూడా లైట్లు వేశాము. అని చెప్పారు.

లేబర్ సొసైటీల గురించి కూడా వారు చెప్పారు. 10 వేలరూపాయల పని వున్నట్లయితే Tenders ను పిలువకుండా, డిపాజిట్ అడుగకుండా చిన్నచిన్న పనులను ఈ సంఘాలకే ఇవ్వాలని ఉత్తర్వులు ఇచ్చాము. ఉద్యోగస్తులు సరిగా పని చేయటంలేదని అన్నారు. వారి గురించి కూడా మేము విచారిస్తాము. ఏనాదులకు ప్రత్యేకంగా హాస్టలేకావాలని వేమయ్యగారు చెప్పారు. ఏనాదులకు ప్రత్యేకంగా కాలనీవుంది. ఒక హరిజన స్త్రీ పొలంలో పని చేస్తుంటే ఆమెను వెళ్ళ గొట్టారని ఆ సంఘువారు చెప్పారు. ఆ భూమి గురించి రెవెన్యు డిపార్టుమెంటు వారు ఏడిసిషన్ ఇచ్చారో. నాకు తెలియదు. న్యాయం కలుగటానికి ప్రయత్నిస్తాము.

13th March, 1958]

సర్వీసులలో హరిజనులకు జరుగుతున్న అన్యాయమును గురించి కొంత మంది చెప్పారు. 100 కి 16 ఉద్యోగాలు హరిజనులకు, 25 వెనుకబడిన వారికి రిజర్వు చేయబడ్డాయి. ఎక్కడైనా కొన్ని చోట్ల అన్యాయము జరిగితే వాటినే దృష్టిలో పెట్టుకొని సరిగా జరగటం లేదని చెప్పటం భావ్యం కాదని మనవి చేస్తున్నాను. ఎక్కడైనా అన్యాయములు జరిగితే గౌరవ సభ్యులు మాదృష్టికి తీసుకురావాలని కోరుతున్నాను. మానవులం కాబట్టి ఎక్కడైనా పొరబాటు జరగటం సహజము "To err is human" అని అన్నారు. ఎక్కడైనా పొరబాటు జరిగితే దానిని సరిదిద్దటానికి సిద్ధంగా వున్నాము. సీతాకుమారి, సీతయ్యగుప్తగార్లు మాట్లాడటానికి అవకాశం లేనందువల్ల కొన్ని విషయాలను వ్రాసి ఇచ్చారు. ఆనందరావుగారు కూడా కొన్ని విషయాలు తెల్పారు. వాటన్నంటికి సమాధానం చెప్పటానికి వ్యవధిలేదు. వాటన్నింటిని దృష్టిలో పెట్టుకొని ఆ కార్యక్రమమును నడిపించటానికి ప్రియత్నిస్తామని మనవి చేస్తున్నాను.

ఈ పద్దును ఆమోదించ వలసినదిగా మీ ద్వారా గౌరవ సభ్య అందరిని కోరుతున్నాను.

DEMAND NO. XXVII—*Welfare of Scheduled Tribes, castes etc.*
*Rs. 2,39,16,100.*

409 (1173) *MR. SPEAKER*: The question is:

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To impress on the Government to expedite the proceedings to land acquisition to Harijans and Scheduled tribes and Vimukhta Jathis and also to the Backward classes.

The motion was negatived.

*MR. SPEAKER* : The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To impress upon the Govt. to implement the Malayappan Report.

The motion was negatived.

*SRI VAVILALA GOPALAKRISHNAYYA* : I demand a division Sir:

The House then divided : Ayes 31; Noes 102;
The motion was negatived.

411 (400) *MR. SPEAKER* : The questlon is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా, తాలూకా పెనుబర్తి గ్రామ హరిజనులకు ఇండ్ల స్థలము ఇప్పించుటలో జాప్యము చేయుచున్నందులకు.

The motion was negatived.

412 (127C) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హైదరాబాదు నగరంలోని, మరియు తెలంగాణాలోని కాస్మాపాలిటన్ హాస్టల్సు వెనుకబడిన జాతుల, షెడ్యూల్డుకేస్టు, విముక్త జాతుల హాస్టల్సుకు ప్రభుత్వమిచ్చు ధనసహాయం విద్యార్థులకు సరిపోవటంలేదు. ఉపోషాలుండాలిసి వస్తున్న విషయాన్ని చర్చించుటకుగాను.

The motion was negatived.

*SRI D. DHARMA BHIKSHAM* : I demand a division Sir :
The House then divided : Ayes 31; Noes 102;
The motion was negatived.

413 (1271) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులు, వెనుకబడిన జాతులవారు, మరియు పేద ప్రజానీకమునకు ఇండ్ల స్థలాలు ఇప్పించుటలో ఇండ్ల నిర్మాణం చేయించుటలోవిఫలత చెందినందు లకు చర్చించుటకుగాను.

The motion was negatived.

414 (1216) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

షెడ్యూలు జాతులు, నిమ్నజాతులు వెనుకబడిన జాతులు మొదలగువారి అభివృద్ధికి తగినంత ధనాన్ని కేటాయించునట్లు చేయకపోవడం గురించి.

The motion was negatived.

415 (1215) *MR. SPEAKER* : The question is ;
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

13th March, 1958]

అడవి ప్రాంతాలలో నివసించుచున్న కొండజాతులవారు అడవి కలపను ఉచితంగా అనుభవించు అవకాశం కల్పింపక పోవడం గురించి.

The motion was negatived.

416 (1214) *MR. SPEAKER* : The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కోయ ప్రజలకు భూములను కేటాయించి, ఎరువులు, విత్తనాలు, వ్యవసాయ పరికరాలు పశువులు సప్లయి చేయకపోవడం గురించి, వారి ఆర్థిక విధానాన్ని బాగుపర్చడానికి తగినంతగా తోడ్పడం గురించి.

The motion was negatived.

417 (1213) *MR. SPEAKER* : The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కోయ ప్రజల విద్యాభివృద్ధికి, ఆరోగ్యాభివృద్ధికి తగిన శ్రద్ధ తీసుకొనక పోవడం గురించి.

The motion was negatived.

419 (240) *MR. SPEAKER* : The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజన గిరిజన విద్యార్థులకు సరియైన భోజన వసతులు మరియు స్కాలరుషిప్పులు ఇవ్వలేనందులకు.

The motion was negatived.

420 (573) *MR. SPEAKER* : The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సూర్యాపేట తాలూకాలో హరిజన ఇళ్ల స్థలాల సమస్య ఒక ఫార్సుగా తయారైనందుకు.

The motion was negatived.

422 (554) *MR. SPEAKER* : The question is :

To reduce tha allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

గ్రామాలలో అంటరానితనపు నిర్మూలన కొరకు ప్రచారం, దానివల్ల కలుగుచున్న అవకతవకలగురించి, దానికొరకు అనవసరంగా డబ్బు దుర్వినియోగం గురించి.

[13th March, 1958

423 (553)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సూర్యాపేట తాలూకా హరిజనులకు మంచినీటి బావులు లేక మురికి నీరు త్రాగి నానా రోగాలకు గురిఅవుతున్న హరిజన కుటుంబాలు అందుకు ప్రభుత్వ నిర్లక్ష్యవైఖరి గురించి.

424 (552)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సూర్యాపేట తాలూకా హరిజన ఇండ్ల స్థలాలు మంజూరి అయిన వాటిని ఇప్పటివరకు ప్లాటుచేసి ఇచ్చుటకు గ్రామ పెత్తనదారి వర్గపు ఆటంకం, ప్రభుత్వ ఉద్యోగుల వైఖరి గురించి.

425 (551)

To reduce the allotment of Rs, 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా హరిజనులకు ఇండ్ల స్థలాలు ఇచ్చుటలో ప్రభుత్వంవారిఉద్యోగుల పక్షపాతవైఖరి, ఇందు మూలంగా హరిజనులకు కలిగే కష్టనష్టాలను గురించి.

The motions were negatived.

426 (411) *MR. SPEAKER*: The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా తరుణవాయి గ్రామ హరిజనులు క్రయము భరించెదమని చెప్పుచుండినను, వారి పొలములకు నీటికాలువను భూసంపాద చట్టము క్రింద వారికి కాలువను యేర్పాటు చేయుటలో జాప్యము జరుగుచున్నందుకు.

427 (401)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

ఆత్మకూరు తాలూకా, కారిమెర్ల గ్రామ ప్రాథమిక సాంఘిక సంక్షేమ పాఠశాలను హయ్యర్ ఎలిమెంటరీ స్కూలుగా మార్పు చేయుటలో జాప్యము జరుగుచున్నందుకు.

428 (399)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

13th March, 1951]

నెల్లూరు జిల్లా ఆత్మకూరు తాలూకా కలువాయి గ్రామ హరిజనులకును, కోవూరు తాలూకా సిగ్గారెడ్డి పాలెం హరిజనులకు మంచినీళ్ళ బావిన్ని, కోవూరు తాలూకా (1) వెంకనపురం (2) పోతిరెడ్డి పాలెం గ్రామ హరిజనులకు మంచినీళ్ల బావిన్ని, కోవూరు తాలూకా అన్నారెడ్డి పాలెం హరిజనులకు, పొదిలి మీర్జాపేట హరిజనులకు మంచినీళ్ళ బావిన్ని ఏర్పాటు చేయించనందులకు.

429 (398)

To reduce the allotment of Rs. 2,39,16,100 for

Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా కోవూరు తాలూకా 1. ఊటుకూరు గ్రామ హరిజనులు రామస్వామిగుంటకు పోవుటకు డొంకను 2. విడువలూరు గ్రామ హరిజనులకు డొంకను 3. ఎల్లాయిపాలెంను మజరా రామాపురం గ్రామ హరిజనులు ఇతర వెనుకబడిన జాతులకు బానుమువ పూర్తిగ భరించగలమని చెప్పుచున్నప్పటికీ భూసంపాద చట్టముక్రింద తమ భూములను యిప్పించుటలో జాప్యం జరుగుచున్నందులకు.

430 (396)

To reduce the allotment of Rs. 2,39,16,100 for

Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరుజిల్లా కోవూరు తాలూకా 1. పరమది మజరాపల్లెపాలెం 2. ఇస్కపాలెం మజరా జవ్వాది లక్ష్మీపురం వెనుకబడిన జాతులవారు ఇండ్లస్థలము భూసంపాదన చట్టముక్రింద యిప్పించినయెడల భూమి పూర్తి క్రయము చెల్లించుటకు సిద్ధముగా నున్ననూ ఇండ్ల స్థలమును ఇప్పించుటలో జాప్యము జరుగుచున్నందులకు.

431 (397)

To reduce the allotment of Rs. 2,39,16,100 for

Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

నెల్లూరు జిల్లా నెల్లూరు తాలూకా 1. నేదూరు మజరా అల్లెపోలు దారపు పల్లెపాలెం వెనుకబడిన జాతుల భూసంపాదన చట్టముక్రింద తమకు డొంకను సంపాదించినయెడల ఆ భూమి పూర్తి క్రయము భరించుటకు ఒప్పుకొన్ననూ వారికి డొంకను యేర్పాటు చేయుటలో జాప్యము జరుగుచున్నందులకు.

432 (395)

To reduce the allotment of Rs. 2,39,16,100 for

Welfare of Scheduled tribes etc. by Rs. 100

నెల్లూరు తాలూకా 1. పరిణి 2. బీరంగుంట 3. మట్టిపాడు 4. పెదపుత్తేరు 5. ఇనమడుగు 6. మానెగుంటపాడు 7. చెల్లాయిపాలెం 8. దామరమడుగు

[13th March, 1958

9, బుచ్చిరెడ్డిపాలెం 10. దువ్వూరు 11. సిద్దిపురం 12. వెంగారెడ్డిపాలెం. 13. దువ్వూరు మజరా దిబ్బలమీద మాలవాడ హరిజనులకు ఇండ్లస్థలము యిప్పించుటలో ఆలస్యము జరుగుచున్నందుకు.

The motions were negatived.

435 (786) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

సంగారెడ్డి, మెదకు జిల్లా కేంద్రములో ఇంతవరకు హరిజనవసతి గృహములకై భవన నిర్మాణము జరుగనందులకు.

436 (785)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కనీసము అన్ని జిల్లా కేంద్రములలోనయిన హరిజన బాలకులకై వసతి గృహములను ఏర్పాటు చేయనందులకు.

437 (784)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

జిల్లాలలో గల హరిజన హాస్టల్సుకు సరిపోవు గ్రాంట్సు మంజూరు చేయనందులకు.

438 (783)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు, షెడ్యూల్డు కులాలవారికి గ్రామాలలో ఇండ్ల వసతి కల్పించుటలో ప్రభుత్వ అధికారులు చేయుచున్న ఆలస్యమును చర్చించుటకు.

439 (780)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, castes etc. by Rs. 100

హరిజనులకు, షెడ్యూల్డు కులాలవారికి చిన్న చిన్న పరిశ్రమలు నేర్పుటకై ప్రోత్సాహము, సహాయము చేయనందులకు.

The motions were negatived.

446 (247) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

13th March, 1958]

హరిజనులకు అస్పృశ్యతను నివారణ చేయలేనందుకు, హరిజనులకు మరియు గిరిజనులకు గృహవసతులను ఏర్పాటు చేయలేనందులకు.

The motion was negatived.

447 (162) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100
For not providing house-sites to Harijans.

448 (163)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

For not providing drinking water wells to backward classes.
The motions were negatived.

452 (1068) *MR. SPEAKER* :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To discuss the failure of the Government to provide house-sites, drinking water facilities and free medical aid, boarding facilities and free medical aid, boarding and lodging facilities for harijans.

The motion was negatived.

*SRI B: SRIRAMA MURTY* : I demand a divisions Sir.

The House divided : Ayes : 32 ; Noes : 103 ;

The motion was negatived.

453 (1067) *MR. SPEAKER* : The question is :

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

కొండజాతి ప్రజలనుండి పశువుల పుల్లరి వసూలు నిలిపి వే౹ అడవి పంటలను అనుభవించే ఆటవిక ప్రజల హక్కును గుర్తించి విరివిగా రుణాలు మంజూరు చేయుట ద్వారా వ్యవసాయమునకు ప్రోత్సహించు విధానము లేనందున ప్రభుత్వ మును విమర్శించెందుకు.

454 (1065)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

To criticise the failure of the Government to liquidate unemployment and under-employment of the scheduled Castes and Tribes.
The motions were negatived.

456 (973) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

[13th Mareh, 1958

వెనుకబడిన తరగతుల విద్యార్థులకు ఎక్కువ మార్కులు ప్రాతిపదికగా తీసుకొని ఆర్థిక సహాయం చేస్తున్నామంటూ ఆ ప్రాతిపదికను భగ్నపరచి ఆశ్రిత పక్షపాతం చూపుతున్నందుకు.

457 (972)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

ఇంటి స్థలాలు కేటాయించి ధనాన్ని ఖర్చుపెట్టినచోట కూడా స్థలాలను విడదీయుటకు 3 సం. రాలుగా ఆలస్యంచేస్తూ సుమారు 25 వేల రూపాయలను జీవం లేని ధనంగా తయారు చేస్తూవున్నందుకు.

The motions were negatived.

458 (965) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

అస్పృశ్యతా నివారణ చురుకుగా జరుగనందుకు.

459 (964)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు ఇండ్ల స్థలములుయిచ్చే విధానములో ఆలస్యము జరిగినందుకు.

The motions were negatived.

460 (878) *MR. SPEAKER* : The question is :
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

వెనుకబడ్డ తరగతుల ప్రజల విద్యాభివృద్ధికి కనీసం వారి గుడిశలలో రాత్రి పాఠశాలలు నెలకొల్పనందుకు.

461 (879)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc., by Rs. 100

లంబాడీ, ఎరుకల, యానాది మొదలగు వెనుకబడ్డ తరగతుల ప్రజలను అన్ని రంగాలలో వారిమీద సాగుతున్న దోపిడీలను అరికట్టనందులకు.

462 (876)
To reduce the allotment of Rs 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనుల బావుల మరమ్మత్తులకు మంజూరి అయిన సొమ్మును వారి ప్రతినిధులకే ఇవ్వక గ్రామాధికారులకు మాత్రనే యిచ్చి చేయించబూనుకొంటున్నందురకు.

463 (877)
To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

13th March, 1958]

లంబాడీ, ఎరుకల మొదలగు వెనుకబడ్డతరగతుల ప్రజల అభివృద్ధికి ఎలాంటి శ్రద్ధ తీసుకోక పోవడం గురించి.

464 (875)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు మంచినీటి బావులు తీయించుటకు, మరమ్మతులు చేయించుటకు సంవత్సరాల తరబడిగా జాగుచేస్తున్నందులకు.

465 (873)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Tribes, Castes etc. by Rs. 100

హరిజనులకు ఇండ్లస్థలాలు యిప్పించుటలో మంజూరీచేసి పంపకం చేయుటలో ప్రభుత్వం తగినంత శ్రద్ధ కనబరచక పోవడం గురించి.

466 (874)

To reduce the allotment of Rs. 2,39,16,100 for
Welfare of Scheduled Castes, Tribes, etc., by Rs. 100

హరిజనుల యిండ్ల నిర్మాణమునకు ప్రభుత్వం చర్యలు తీసుకోక పోవడం గురించి.

The motions were negatived.

*MR. SPEAKER* : The question is :

"That the Government be granted a sum not exceeding Rs. 2,39,16,100/- under Demand No. XXVII—Welfare of Scheduled Tribes, Castes, etc."

The motion was adopted.

*The House then adjourned till Half Past Eight of the Clock on Friday, the 14th March, 1958.*